"నీకు మం దేమిటో తెలుసా.. రోజుకీ మూడు సార్లు రస్న"

ఒక నారింజ రుచి! బలే మజా!

రస్న

భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్





# తెల్లగా, కొత్తవాటిలా !

ఉతుకు ఉతుక్కి... ఉతికిన ప్రతిసారీ...
ఉతుకుతుంది పవర్ ప్యాక్డ్ సర్ఫ్ మీ బట్టల్ని
తెల్లగా... ఉంచుతుంది కొత్త వాటిలాగ!

ప్రతి చొక్కా, ప్రతి బట్టా మీరు కొని మడత విప్పినప్పుడు ఎంత చక్కగా, ఎంత తెల్లగా, ఎంత కొత్తగా ఉన్నాయో, అలాగే ఉంటాయి.

ఎందుకంటే, ఇప్పుడు పవర్ ప్యాక్డ్ సర్ఫ్ మునపటికన్నా మరింత మెరుగైనది. దీనిలోని నురుగు మునపటికన్నా మరింత సమృద్ధమైనది.

సర్ఫ్, వదలని మురికిని వదలగొట్టేందుకు మరింత శక్తివంతమైనది. మీ బట్టల కొత్తదనం చాలాకాలంపాటు నిలిచి వుండేలాగ సంరక్షించేది.

అవును, తెల్లబట్టలైనా, రంగు బట్టలైనా, అప్పుడప్పుడు వాడేవైనా, రోజూ వాడే బట్టలైనా, అన్నిటినీ...కొత్తవాటిలా ఉంచేది ఒకే ఒక పౌడర్–సర్ఫ్.




## సర్ఫ్ ఉతుకుతుంది ఎంతో తెల్లగా... ఉంచుతుంది మీ బట్టలను సరికొత్తగా!

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి నిర్దిష్ట ఉత్పత్తి.



# చందమామ

మార్చి 1986



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["కనకసెట్టి కథ"]కు ఆధారం, రాంబాబు రచన. ప్రతి మనిషీ తన చేతనైన వృత్తిలో ధన సంపాదనకు ప్రయత్నిస్తాడు. కాని, కొందరు అధిక సంపాదనాపరులైతే, మరి కొందరు ఏ కొద్దిపాటి ధనంతోనో కాలం వెళ్ళబుచ్చుతారు. అయితే, ప్రతి ఒక్కరూ వృత్తిధర్మం పాటించాలి. ఈ నీతి, "స్వయం కృతాపరాధం'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

శ్రోతవ్య ముక్త మవ్యేన, శ్రుత్వా సమ్య గ్విచారయేత్,
విచారేణైవ కర్తవ్యః సత్యాసత్య వినిర్ణయః.

[ఎవరు ఏ విషయం చెప్పినా పూర్తిగా వినాలి. విన్న విషయాలను గురించి బాగా ఆలోచించిన తరవాతే, సత్యాసత్యాలను నిర్ణయించాలి.]

సంపుటి 78 మార్చి '86 సంచిక 3

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00



## చందమామ కబుర్లు



### కుజగ్రహ యాత్ర!

ఇరవైయేళ్ళక్రితం వెర్న్‌హర్ వాన్ బ్రాన్ అనే శాస్త్రజ్ఞుడు—1984 వ సంవత్సరం నాటికి, మనిషి కుజగ్రహానికి వెళ్ళి రాగలడన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. అది నిజం కాలేదు. అయితే, అమెరికాకు చెందిన నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (నాసా) సంస్థ—1990 నాటికి మనిషిలేని వ్యోమనౌకను కుజగ్రహానికి పంపడానికి కృషి చేస్తున్నది.

### ప్రాచీన భారతదేశంలో అక్యుపంక్చర్



సూదులతో గుచ్చి వ్యాధులను నయం చేసే అక్యుపంక్చర్ చికిత్స పురాతన భారతదేశంలోనే ప్రారంభమయిందని, అలహాబాదులోని ఇండియన్ అక్యుపంక్చర్ సెంటర్ డైరెక్టర్ డా॥ పి. కె. సింగ్ అభిప్రాయపడుతున్నారు. ఇటీవల బీజింగ్‌లో జరిగిన ఒక సదస్సులో డా॥ సింగ్ ఉపన్యసిస్తూ—భీష్ముడు శరతల్పం మీద 58 రోజులు పడుకుని నిర్ణీత సమయంలో ప్రాణాలు వదలడాన్ని ఒక ఉదాహరణగా సూచించారు.



### టూత్‌పేస్ట్ ఆహారం!

అమెరికాకు చెందిన జూడీ ష్వార్ట్స్ అనే 27 సంవత్సరాల వనిత పడవప్రయాణం చేస్తూ తప్పిపోయి, ఇండొనేషియా తీరసముద్రంలో 21 రోజులపాటు గడపవలసి వచ్చింది. అప్పుడామె తన వద్ద ఉన్న ఒక ట్యూబ్ టూత్‌పేస్ట్‌ను, కొద్ది కొద్దిగా తిని ప్రాణాలు నిలుపుకున్నది.

## మీకు తెలుసా?

1. సాధారణంగా మనిషి శరీరంలో నాడి నిమిషానికి ఎన్నిసార్లు కొట్టుకుంటుంది?
2. ప్రప్రథమంగా శస్త్రచికిత్స ద్వారా మనిషి గుండె మార్పిడి ఎప్పుడు జరిగిందో మీకు తెలుసా?
3. సగటు మనిషి మెదడు పరిమాణం ఎంతో మీకు తెలుసా?
4. రక్తంలోని ఎర్రకణాలు ఎంతకాలం ప్రాణంతో ఉంటాయో మీకు తెలుసా?
5. అలెగ్జాండర్ ఫ్లెమింగ్ ఎందుకు సుప్రసిద్ధుడు?

(సమాధానాలు 65 వ పేజీలో)

పురాణగాథలు :

# అలంబుస

దేవేంద్రుడి కొలువులోని అప్సరసలలో ఒకతె అలంబుస. ఒకనాడామె తన ప్రియుడైన విధూము డనే గంధర్వుడితో మాట్లాడుతూ, అటుకేసి వచ్చిన దేవేంద్రుణ్ణి గమనించలేదు. దేవేంద్రుడు దానికి ఆగ్రహించి, "మీరు భూలోకంలో మానవులై పుట్టి, భార్యాభర్తలుగా జీవించండి," అని శపించాడు.

ఆ శాపప్రభావంతో, విధూముడు కౌశాంబి యువరాజు సహస్రానీకుడుగానూ, అలంబుస మృగవతిగానూ జన్మించారు. వారిద్దరికీ వివాహం నిశ్చయమయింది. ఆ సమయంలో దేవదానవులకు యుద్ధం చెలరేగడంతో, దేవేంద్రుడు సహస్రానీకుడి సహాయం కోరాడు. సహస్రానీకుడు దేవతలపక్షం వహించి రాక్షసులను ఓడించి, భూలోకానికి తిరిగి వస్తున్నప్పుడు, దేవేంద్రుడు అతనికి తోడుగా తిలోత్తమను పంపాడు. సహస్రానీకుడు రథంలో వస్తూ, మృగవతి మీది జ్ఞాపకాలతో, తిలోత్తమ అడిగిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వలేదు. అతని ప్రవర్తనకు కోపించిన తిలోత్తమ, "నువు ఎవరి మీది ధ్యాసతో నా ప్రశ్నలను ఉదాసీనపరిచావో, వాళ్ళ నుంచి పధ్నాలుగేళ్ళు ఎడబాటు అనుభవింతువుగాక !" అని శపించింది.

సహస్రానీకుడు కౌశాంబి చేరి, మృగవతిని వివాహమాడాడు. మృగవతి గర్భం ధరించింది. ఆమె ఒకనాడు భర్తను, పరిమళజలం నింపిన ఎర్రటి కొలనులో స్నానం చేయాలన్న కోరిక కోరింది.

మృగవతి ఎర్రటి పరిమళజలం నింపిన కొలనులో స్నానం చేస్తున్నప్పుడు—రక్తతటాకంలోని మాంసం ముద్ద అని భ్రమించి, ఆమెను ఒక పెద్ద డేగ వచ్చి తన్నుకుపోయింది. సహస్రానీకుడెంతో విచారం చెందాడు.

డేగ మృగవతిని తీసుకుపోయి సుదూరంలోని ఒక కొండ శిఖరం మీద వదిలింది. ముని కుమారుడొకడు ఆమెను జమదగ్ని ఆశ్రమానికి చేర్చాడు. ఆమె అక్కడ ఉదయనుడనే పిల్లవాణ్ణి ప్రసవించింది.

పధ్నాలుగేళ్ళు గడిచాక, ఒకనాడు పాములవాడొకడు, ఒక పామును పడుతూండటం బాలుడయిన ఉదయనుడి కంటబడింది. పాము తప్పించుకోడానికి పడేపాట్లు చూసి, ఉదయనుడు జాలిపడి, పాములవాడికి ఒక బంగారుగాజును ఇచ్చి పామును వదిలిపెట్టమన్నాడు. పాములవాడు ఆ బంగారు గాజును కౌశాంబి నగరానికి తీసుకుపోయి అమ్మేటప్పుడు, అది రాణిగారిదని సహస్రానీకుడికి తెలియవచ్చింది. ఆయన పాములవాణ్ణి వెంటబెట్టుకుని, జమదగ్ని ఆశ్రమానికి పోయి, భార్యాపిల్లలను కలుసుకుని, వాళ్ళతో రాజ్యానికి తిరిగి వచ్చి హాయిగా జీవించాడు !







# తెలివిగల అల్లుడు

వీరభద్రరాయుడనే ఒక చిన్న జమీందారుకు, లేక లేక ఒక కుమార్తె కలిగింది. జమీందారు ఆమెకు సుప్రియ అని పేరు పెట్టుకుని అల్లారుముద్దుగా పెంచాడు. ఆమెకు చదువుసంధ్యలైతే బాగానే అబ్బినై కాని, ప్రతి చిన్న విషయంలోనూ, నా మాటే గెలవాలని మొండిపట్టు పడుతూండేది.

జమీందారుకు తన కూతురు మంచి తెలివిమంతురాలని తెలుసు. అది ఆయనకు సంతోష కారణంగా వుండేది. అయితే, ఆమె మొండితనం మాత్రం ఆయనకు తరచూ చెప్పలేనంత చిరాకు గలిగిస్తూండేది.

సుప్రియకు పెళ్ళీడు రాగానే జమీందారు తగిన 'అల్లుడికోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. ఆయన హోదాకు తగిన కుటుంబాల్లో కొందరు యువకులున్నారు. కాని, వాళ్ళల్లో ఎక్కువమంది దుర్వ్యసనాలకు అలవాటుపడ్డవాళ్ళు. అలా కాని ఒకరిద్దరు యువకుల్ని తండ్రి పెళ్ళిచూపులకు తీసుకువస్తే—వీళ్ళు మన డబ్బుకు ఆశపడి వచ్చినవాళ్ళు, అంటూ సుప్రియ నిరాకరించింది.

చివరకు జమీందారు విసిగిపోయి కూతుర్ని, "నీకెలాంటి భర్త కావాలో, నాకు అర్థం కావడం లేదు!" అంటూ విసుక్కున్నాడు.

"నేను నిజాయితీతోపాటు, మంచి తెలివితేటలున్నవాణ్ణే పెళ్ళాడతాను," అన్నది సుప్రియ.

"తండ్రిగా నేను కోరుకునేదీ అదే. అయితే, పెళ్ళాడతానంటూ వచ్చిన వాడిలో, ఆ లక్షణాలు వున్నదీ లేనిదీ ముందుగా తెలుసుకోవడం ఎలా?" అని అడిగాడు జమీందారు.

ఎం. డి. సౌజన్య



సుకేతుడనే వాడొకడున్నాడు. వాడు లెక్కలు తారుమారు చేసి డబ్బు కాజేస్తున్నాడన్న అనుమానం తండ్రీ, కూతుళ్ళకున్నది. కాని, అది రుజువు చేసేందుకు ఎలాంటి ఆధారం వాళ్ళకు దొరక్కపోవడంతో, మెదలకుండా వూరుకున్నారు.

ఒకనాడు జమీందారూ, సుబుద్ధీ కలిసి పక్క ఊరుకు వెళ్ళవలసి వచ్చింది. ఆ ఊరుకు బండిదారి లేదు; కాలినడకన పోవలసిందే. వాళ్ళు ప్రయాణమవుతూండగా, సుప్రియ రెండు దొంతరలుగా వున్న పాత్రల్లో పంచభక్ష్యాలు పెట్టి, సుబుద్ధి చేతికిచ్చి, "ఆదిప్రయాణికుల్లా, దారి భారం కాకుండా, చెరిసగం పంచుకోండి," అన్నది.

జమీందారుకు సుప్రియ మాటల అర్థం బోధపడక, ఆకలి అయినప్పుడు, తను యిచ్చినది దారిలో చెరిసగం తినమంటున్నది, అనుకున్నాడు.

అయితే సుబుద్ధి ఆయనతో, "ఆది ప్రయాణికులంటే సూర్యుడు, చంద్రుడు అని అర్థం. దారి భారం కాకుండా అంటే, ప్రయాణబడలిక మరిచిపోవడానికి, ఏవైనా కబుర్లో, కథలో యిద్దరూ చెప్పుకోండి, అని మీ అమ్మాయిగారి మాటల అర్థం!" అని వివరించాడు.

"నాన్నా, దానికొక పరీక్ష వున్నది. ఆ వచ్చిన వరుడు, నేను నిగూఢంగా మాట్లాడే మాటల అర్థం గ్రహించగలగాలి," అన్నది సుప్రియ.

పరిస్థితి ఇలా వుండగా, సుబుద్ధి అనే ఒక చితికిపోయిన జమీందారు కొడుకు, వీరభద్రరాయుడి దగ్గిరకు వచ్చి, దివాణంలో ఏదైనా ఉద్యోగం కావాలని అడిగాడు. అతడి మాటతీరూ, రూపం జమీందారుకు నచ్చినై. ఆయన అతణ్ణి పనిలో చేరమన్నాడు.

సుబుద్ధి దివాణంలో చేరిన రోజు నుంచీ సుప్రియ అతణ్ణి గమనిస్తూనే వున్నది. జమీ ఆదాయవ్యయాల లెక్కలు రాసే

అది విని తండ్రీ, కూతుళ్ళకు చాలా ఆనందం కలిగింది.

మరొకనాడు సుబుద్ధి అడవిలో వున్న కోయవాళ్ళ దగ్గిరకు పోయి, సుప్రియ కోసం పుట్టతేనే, పునుగూ లాంటి సుగంధ ద్రవ్యాలు తేవలసి వచ్చింది. అతడు బయలుదేరే సమయంలో సుప్రియ గీత కత్తి లాంటిది ఒకటి తెచ్చి అతడికిస్తూ, "ఒంటరిగా వెళుతున్నారు. ఈ కత్తి సాయంతో ఒక గుర్రాన్ని తోడుగా తీసుకు వెళ్ళండి," అన్నది.



కూతురు మాటలు జమీందారుకేమీ అంతుబట్టలేదు. ఆయన సుప్రియతో, "ఆ అడవి మార్గమంతా కొండలా, గుట్టల మయం. మనిషి నడవడమే కష్టం. తోడుగా ఒక గుర్రమా ?" అన్నాడు.

సుప్రియ, సుబుద్ధి కేసి చూసింది. అప్పుడు సుబుద్ధి జమీందారుతో, "ఈ కత్తితో ఒక చెట్టుకొమ్మ నరికి, దాన్ని చేతి కర్ర ఊతంగా తీసుకుపొమ్మని అమ్మాయి గారు చెప్పారు. గుర్రం అంటే అదే," అన్నాడు.

కొద్ది రోజుల తర్వాత జమీందారు గుమాస్తా సుకేతుడు, అట్టహాసంగా తన చెల్లెలి పెళ్ళి చేస్తూ, ఊళ్ళో అందరితో పాటు జమీందారునూ, సుప్రియనూ, సుబుద్ధినీ విందుభోజనానికి పిలిచాడు.

సుప్రియ అతడితో, "మీ చెల్లెలి పెళ్ళి మహా ఘనంగా చేసినట్టుంది. మీ ఇంటి పునాది గట్టిదేనా ?" అన్నది.

ఆ ప్రశ్నకు సుకేతుడు, "అమ్మా, మాది పాతకాలపు పదినిట్టాడుల పూరిల్లు. దానికి పెద్దగా పునా దేముంటుంది !" అన్నాడు.

ఆ సమయంలో సుబుద్ధిలేడు. సుప్రియ తండ్రితో, "నేను సుకేతుణ్ణి అతడి ఆర్థిక స్తోమతు గురించి అడిగాను. అతడిది దొంగబుద్ధి అన్న అనుమానం, నాకు ధ్రువపడుతున్నది. ఆ సంగతి సుబుద్ధి ద్వారా తేల్చగలను. అందుకొక ఉపాయం వున్నది." అన్నది.



వారం రోజుల తర్వాత జమీందారూ, సుబుద్ధీ కుప్పనూర్పిళ్ళు ఎలా జరుగుతున్నదీ చూసేందుకు పొలం వెళ్ళారు. భోజనాలవేళప్పుడు ఆమె, సుకేతుణ్ణి పిలిపించి, అతడికి దొంతరగా కట్టివున్న ఆరు గిన్నెలు యిచ్చి, "పైమిద్దె మీద పూర్ణమిచంద్రుడున్నాడు. అడుగు మిద్దెలో ఆరుపుట్ల ధాన్యం వుంది. ఊళ్ళో దొంగల భయం కదా! నాలుగు దిక్కులూ జాగ్రత్తగా చూస్తే, దొంగను పట్టవచ్చు! నేను అన్న యీ మాటలు సుబుద్ధికి చెప్పండి," అన్నది.

భోజనపాత్రలు తీసుకుని పొలం బయలుదేరిన సుకేతుడికి, దారిలో ఒక సంశయం కలిగింది. సుప్రియకు, సుబుద్ధి పట్ల ఆదరాభిమానాలు పెరుగుతూండడం అతడు గమనిస్తూనే వున్నాడు. బహుశా యిది పెళ్ళికూడా దారి తీయవచ్చు. తాను అంతగా అభిమానించే సుబుద్ధికి, సుప్రియ ఎంత విలువైన వంటకాలు పంపుతున్నదో, చూడాలనిపించింది సుకేతుడికి.

అతడు పాత్రల కట్టు విప్పి, ఆరు పాత్రల్లో వున్న వంటకాలూ చూశాడు. దానితో అతడికి నోరూరింది. ఎవరికీ అనుమానం రాకుండా పాత్రల్లో వున్న పదార్థాలన్నీ కొద్ది కొద్దిగా తిని, ఎప్పటిలా వాటికి కట్టుకట్టి, తీసుకుపోయి సుబుద్ధికిచ్చాడు.

సుబుద్ధి దొంతరగా వున్న గిన్నెలు ఒక్కొక్కటే తీస్తూండగా, సుకేతుడు అతడికి జమీందారు కూతురు చెప్పమన్న మాటలు చెప్పాడు. పక్కనే వున్న జమీందారుకు అవేమీ అర్థం కాలేదు. కాని, సుబుద్ధి పాత్రలను పరీక్షించి, సుకేతుడితో, "నీ దొంగబుద్ధి బయటపెట్టడానికి, సుప్రియ గూఢార్థం వున్న ఆ మాటలు నాకు చెప్పమన్నది. నీది దొంగబుద్ధి. పాత్రల్లో వున్న పదార్థాల్లో కొంత తిన్నావు. ఈ స్వల్పానికే దొంగవైన నువ్వు, దివాణం లెక్కలు రాయడంలో చాలా పెద్ద దొంగ

తనమే చేస్తూండాలి. నిజం చెప్పు!'' అన్నాడు గద్దిస్తూ.

సుకేతుడు సంగతి అర్థం కాక కంగారు పడిపోతూండగా, సుబుద్ధి, ''పైమిద్దెలో పౌర్ణమిచంద్రుడంటే పైనున్న పాత్రలో తెల్లటి మీగడ పెరుగున్నదన్న మాట! అడుగుమిద్దెలో ఆరుపుట్ల ధాన్యమంటే, దిగువనున్న పాత్రలో ఆరు గారెలుంచానని చెప్పడం. ఇప్పుడు ఐదే వున్నవి. నాలుగు దిక్కులూ జాగ్రత్తగా చూడమంటే—తక్కిన నాలుగు పాత్రలు కూడా పరీక్షించితే, దొంగ దొరికిపోతాడని!'' అన్నాడు.

సుకేతుడు భయపడుతున్న తీరు చూసిన జమీందారుకు, అతడు దొంగ అన్న నమ్మకం కలిగింది.

ఆయన అతడితో కోపంగా, ''సరే, వెంటనే కొత్వాలు దగ్గిరకు పద. ఆయనే నీచేత నిజం పలికిస్తాడు!'' అన్నాడు.

కొత్వాలు అనగానే సుకేతుడికి కొరడా దెబ్బలు గుర్తుకువచ్చి, చప్పున జమీందారు కాళ్ళు పట్టుకుని, ''అయ్యా, బుద్ధి తక్కువకొద్దీ లెక్కలేవో కొంత తారుమారు చేసి, తమ ధనం హరించినమాట నిజం. ఖర్చయినదంతా ఖర్చయిపోగా, మిగిలి వున్నదంతా రేపీపాటికి తమకు తెచ్చి యిస్తాను,'' అన్నాడు.

జమీందారు, అతణ్ణి క్షమించి వదిలి వేశాడు. తరవాత ఆయన ముందుగా ఇంటికి తిరిగివచ్చి, జరిగినదంతా కూతురుకు చెప్పి, ''సుబుద్ధిని గురించి, నీ అభిప్రాయం ఏమిటి? ఆ కుర్రవాడు మంచి తెలివైనవాడే కాక, నిజాయితీ పరుడి లాగా కూడా కనబడుతున్నాడు,'' అన్నాడు.

''నా అభిప్రాయం కూడా, అదే నాన్నా. మీకు అల్లుడు కాదగిన అర్హతలన్నీ అతడి కున్నవి,'' అన్నది సుప్రియ ఆనందంగా.

కూతురు జవాబుకు జమీందారు చిన్నగా నవ్వుకుని, నెల తిరక్కుండానే సుబుద్ధికి, సుప్రియనిచ్చి అతివైభవంగా వివాహం చేశాడు.





# ఉత్తమగాయకుడు

శృంగేరి ప్రాంతాలను ఏలే రాజుకు, తన ఆస్థానంలో కవి పండితులతోపాటు, ఒక గాయకుడు కూడా వుంటే బావుంటుం దన్న అభిప్రాయం కలిగింది. ఆయన మంత్రితో, ఈ సంగతి చెప్పి, గాయకుణ్ణి ఎన్నుకునేందుకు సంగీత పోటీ ఏర్పాటు చేయమన్నాడు.

"మీ ఆలోచన బావున్నది. అయితే, ఆ ఎన్నికలో న్యాయనిర్ణేతలెవరు, మహా రాజా?" అని అడిగాడు మంత్రి.

"మరెవరో ఎందుకు? నేనూ, రాణీ, మీరూ—అందరం సంగీత ప్రియులమే గదా. న్యాయనిర్ణేతలుగా మనం ముగ్గురం వుందాం. ఇందుకోసం, మరెవరో విద్వాం సులను ఆహ్వానించడం వృథా" అన్నాడు రాజు.

రాజు సంగీత ప్రియుడే కాని, ఆయన కున్న శాస్త్రీయ జ్ఞానం బహుస్వల్పం. రాణికి మంచి శాస్త్రీయ సంగీత జ్ఞానం వున్నది.

రాజాజ్ఞ ప్రకారం, మంత్రి దేశంలోని సంగీత విద్వాంసులనూ, సామాన్య ప్రజ లనూ ఆహ్వానించి, ఒక పెద్ద సభలో, విద్వాంసులచేత పాట కచ్చేరీ పోటీ ఏర్పాటు చేశాడు.

ఆ పోటీలు మూడు రోజులు సాగినై. ఎంతో గౌరవప్రదమైన ఆస్థాన గాయకుడి స్థానం పొందాలన్న పట్టుదలతో, గాయ కులు తమ సంపూర్ణ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించారు.

రాజు ఆ సంగీత విద్వాంసుల్లో మురళీ నాథు డనే వాణ్ణి, మహారాణి వేణునాథు డనే వాణ్ణి, మంత్రి సుసంగీతు డనే వాణ్ణి ఎన్నిక చేశారు.

రాజు తన ఎన్నికను సమర్థిస్తూ, "మురళీ నాథుడు చాలా శ్రావ్యంగా పాడాడు.

కోలార్ కృష్ణ అయ్యర్

ఆయన పాడుతూంటే, నేను మైమరిచాను. అంత శ్రావ్యంగా, మీ రిద్దరూ ఎన్నిక చేసినవాళ్ళు పాడలేకపోయారు,'' అన్నాడు.

అందుకు రాణి, ''మురళీనాథుడేమిటి; సుసంగీతుడు కూడా శ్రావ్యంగానే పాడాడు. కాని వాళ్ళిద్దరికీ సంగీతంలో, లోతైన శాస్త్రజ్ఞానం లేదు. అది లేనివాడు, నిజమైన విద్వాంసుడనిపించుకోలేడు. అందువల్లనే నేను, వేణునాథుణ్ణి ఎన్నిక చేశాను,'' అన్నది.

అప్పుడు రాజు, మంత్రిని, ''మీరు సుసంగీతుణ్ణి ఎన్నిక చేయడంలో వున్న అంతర్యమేమిటో చెప్పండి?'' అని అడిగాడు.

''మహారాజా, సుసంగీతుడికి శాస్త్రజ్ఞానంతోపాటు, శ్రావ్యంగా పాడగల నేర్పు కూడా వున్నది. గాయకుడైనవాడు పండితులనూ, పామరులనూ సమానంగా రంజింపచేయాలి. ఆ సామర్థ్యం సుసంగీతుడికే వున్నది. ఇది, నా ఒక్కడి అభిప్రాయమే కాదు; ఈ విషయంలో పండితులూ, పామరులూ కూడా నాతో ఏకీభవించారు,'' అన్నాడు మంత్రి.

ఆ జవాబుకు రాజూ, రాణీ ఆశ్చర్యపోయి, ''మీ అభిప్రాయంతో సంగీత విద్వాంసులూ, మామూలు సంగీతప్రియులూ ఏకీభవించారా? వాళ్ళ అభిప్రాయాలు ఎప్పుడు సేకరించారు?'' అని అడిగారు.



ఆ ప్రశ్నకు మంత్రి, "ఆ ముగ్గురూ సభలో పాడుతున్నప్పుడు, సభికుల ప్రవర్తన ఎలా వున్నదో, తమరు గమనించారా?" అని అడిగాడు.

"మురళీనాథుడి పాటలో, నా మనస్సు లగ్నమైపోయింది. అందువల్ల, నేను పరిసరాలనుగమనించలేదు," అన్నాడు రాజు.

"నేను వేణునాథుడి పాట వింటూ, అతడి సంగీతశాస్త్ర పరిజ్ఞానానికి అచ్చెరువు చెందాను. అందువల్ల, నేనూ మహారాజు గారి లాగే, సభికుల ప్రవర్తన గమనించ లేదు," అన్నది రాణి.

"మనం ఎన్నికచేసి, ఆస్థాన విద్వాంసుడుగా నియమించబోయే గాయకుడు, మన ముగ్గురినే కాక, రాజ్యంలోని పండితులను, పామరులను కూడా, తన విద్యతో సంతోషపరచాలి. మహారాజుగారి అభిప్రాయం కూడా, ఇదేననుకుంటాను," అన్నాడు మంత్రి.

"అవును, నా అభిప్రాయం అదే," అన్నాడు రాజు.

"అలా అయితే, ఆ ముగ్గురూ పాడుతున్నప్పుడు సభికుల ప్రవర్తన ఎలా వున్నదో వివరిస్తాను, చిత్తగించండి! మురళీనాథుడు పాడుతూండగా, పండితులొక్కక్కరే సభ విడిచి వెళ్ళిపోయారు. కాని, సామాన్య ప్రజలు మాత్రం ఆనందంతో తల లూపుతూ చివరివరకూ కూర్చున్నారు. ఇక వేణునాథుడు పాడుతూంటే సామాన్య ప్రజలు జట్లుజట్లుగా లేచి వెళ్ళారు. పండితులు మాత్రం తుదివరకూ ఆసక్తితో కూర్చున్నారు. సుసంగీతుడు పాడినప్పుడు మాత్రం; అటు పండితులూ, సామాన్య ప్రజలూ కూడా హర్షధ్వానాలు చేస్తూ, కచ్చేరి ముగిసేవరకూ వుండిపోయారు. ఆ కారణం వల్లనే, నేను ఆ ముగ్గురిలో సుసంగీతుడు ఆస్థాన గాయక పదవికి అర్హుడని ఎన్నిక చేశాను," అన్నాడు మంత్రి.

మంత్రి అభిప్రాయంతో ఏకీభవించి, రాజూ, రాణీ సుసంగీతుణ్ణి ఆస్థాన గాయకుడుగా నియమించారు.






## 17

[చంద్రవర్మకు శివపురం అనే పట్టణంలో సుబాహుడు కనిపించాడు. అతడి ద్వారా చంద్ర వర్మకు సేనాని ధీరమల్లుణ్ణి గురించి తెలిసింది. ఆ సమయంలో ఒక దూత వచ్చి, సేనాని ధీరమల్లుణ్ణి, సర్పకేతుడు పెద్ద సైన్యంతో వెంటబడి తరుముతున్నట్టు వార్త చెప్పాడు. సుబాహుడు ధీరమల్లుడికి సహాయంగా వెళ్ళటం మంచిదని సలహా యిచ్చాడు. తరవాత—]

చంద్రవర్మకు కూడా ఆ పరిస్థితుల్లో సుబాహుడు చెప్పిందే ఉత్తమ మార్గంగా తోచింది. క్షణాల మీద నగరంలోని సైనికులంతా ఒకచోటికి చేర్చబడ్డారు.

కొద్దిసేపటిలో సైన్యమంతా నగర ప్రాకారాలు దాటి ఉత్తర దిక్కుకేసి కదిలింది. చంద్రవర్మా, సుబాహుడూ సైన్యానికి ముందు భాగాన వున్న అశ్వ సైనికుల వెంట వున్నారు. రాత్రంతా సైన్యం ఆగకుండా ముందుకు కదులుతూనే వున్నది. ఇంకా సూర్యోదయం కావటానికి ఒకటీ రెండు ఘడియలుండనగా, ఒక కొండ మలుపు నుంచి పరిగెత్తుకువస్తున్న గుర్రాల గిట్టల చప్పుడు వినిపించింది. ఆ వచ్చేది మిత్రులో, శత్రువులో తెలుసుకునేందుకు సుబాహుడూ, చంద్రవర్మా పదిమంది రౌతులతో సైన్యాన్నుంచి వేరుపడి, అతి వేగంగా ముందుకు




సైనికులు ఇలా చెపుతూన్నంతలో మరి కొందరు గుర్రపు రౌతులు వారికేసి రావటం కనిపించింది. చూస్తూన్నంతలో ధీరమల్లుడు మహావేగంతో వారిని సమీపించి, "సుబాహూ! ఇక మనం నగర రక్షణకు వెళ్ళవలసిందే. సర్పకేతుడితో....'' అంటూ మాట మధ్యలో ఆగి, చంద్రవర్మకేసి చూసి ముఖంలో ఆశ్చర్యం కనబరిచి, అంతలోనే ఎక్కడలేని సంతోషంతో గుర్రం మీది నుంచి ఒక్క గెంతున కిందికి దూకి, "మహారాజా!" అంటూ చంద్రవర్మ దగ్గిరకు పరిగెత్తుకువచ్చి అతడి చేయి పట్టుకున్నాడు.

వెళ్ళారు. సరిగా కొండ మలుపులో నలుగురు అశ్వికులు వారికి ఎదురయారు. మసకచీకటిలో సుబాహుణ్ణి చూస్తూనే వాళ్ళు తమ గుర్రాలను ఆపి, "సేనానీ, రాజప్రతినిధి వీరమల్లు మమ్మల్ని పంపాడు. సర్పకేతు డనే రాజు సైన్యాలు నగరం కేసి పారిపోయి వస్తున్న మన సైనికులను అడ్డదారి వెంట వచ్చి అటకాయించినై. పోరాటం జరిగింది. ఆ పోరాటంలో మనవాళ్ళు చాలామంది మరణించారు. రాజప్రతినిధి తన అశ్వికులతో, శత్రువులు వేగంగా నగరం కేసి రాకుండా అడ్డుతూ తిరోగమిస్తున్నారు,'' అని చెప్పారు.

"మళ్ళీ నిన్ను కలుసుకోగలనన్న నమ్మకం నాకేనాడూ కలగలేదుధీరమల్లూ! కాని మనం ఇలాంటి విచిత్ర పరిస్థితుల్లో కలుసుకున్నాం. తీరిగ్గా మాట్లాడుకునేందుకు ఇది సమయం కాదు. నగర రక్షణకు బయలుదేరుదామా?'' అన్నాడు చంద్రవర్మ.

సేనాని ధీరమల్లుడు ఒక్క క్షణకాలం ముందు వున్న సైన్యం కేసీ, వెనక నుంచి పారిపోయి వస్తున్న అశ్వికులకేసీ చూసి, "మహారాజా! మీ రాకతో పరిస్థితి మారిపోయింది. సర్పకేతుడితో ఆఖరు పోరాటం జరపవలసిన సమయం ఆసన్నమయింది. అది నగరంలో గాని, నగరం వెలపల

గాని, ఎక్కడైనా ఒక్కటే. ఇప్పుడు ఈ మార్గాన ముందుకు తోసుకువస్తున్నది ముఖ్యంగా అతడి అశ్వసైన్యం. కాల్బల మంతా ఆ కొండ వెనక మైదానంలో వున్నది. మనం వ్యూహం పన్నటానికి కొంచెం వ్యవధి కావాలి," అంటూ సుబాహుడి కేసి తిరిగి, "సుబాహూ! సైన్యాన్నంతా పక్కకు మళ్ళించి, ఆ కనబడే కొండ కనుమలోకి తీసుకుపో. కనుమద్వారాన్ని కాపాడుకోవటానికి కొద్ది సైన్యం చాలు. అక్కడ కొద్దిమంది అశ్వికుల్నీ, గురిగాళ్ళయిన కొంతమంది విలుకాళ్ళనూ కాపలా వుంచు," అంటూ చంద్రవర్మతో కలిసి కనుమద్వారం కేసి బయలుదేరాడు.



కొద్దిసేపటికల్లా సైన్యమంతా కనుమలో ప్రవేశించింది. చంద్రవర్మ ధీరమల్లుడితో, తను వీరపురం వదిలిపోయిన తరవాత, తనకు తటస్థపడిన కష్టసుఖాలను గురించి సంగ్రహంగా చెప్పాడు. అంతా శ్రద్ధగా విన్న ధీరమల్లుడు ఎంతో వినయంగా చంద్రవర్మతో, "మహారాజా! నేనూ, సుబాహుడూ, పడ్డ కష్టాలూ, చివరకు ఈ శివసింహరాజు కొలువులో చేరి, ఆయన ప్రతినిధిగా శివపురానికి రావటం—అంతా సుబాహుడు మీకు చెప్పే వుంటాడు. ఈనాడు తలవని తలంపుగా మనకు సర్పకేతుడితో పోరు తటస్థించింది. ఆ దుష్టుడితో ఏదో ఒకనాడు మనం యుద్ధం చేయక తప్పదుగదా? ఆ పని యిప్పుడే చేద్దాం. ఇందులో విజయమో, వీరస్వర్గమో—అంతకన్న మనకు మరో మార్గం లేదు!" అన్నాడు.

"అవును, ధీరమల్లూ! మనం స్వదేశం వదిలి, ఈ విధంగా దేశాలు పట్టుకు తిరగటంలో అర్థం లేదు. సైన్యాన్ని సమాయత్తపరుచు. ఆ సర్పకేతుడితో చావో బతుకో తేల్చుకుందాం," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అంటూండగానే కనుమద్వారం దగ్గిర చెప్పలేనంతగా

కలకలం బయలుదేరింది. అక్కడ కాపలా వున్న విలుకాళ్లు అందరూ బాణాలు ఎక్కుపెట్టి ముఖద్వారం కేసి రివ్వురివ్వుమని వదులుతున్నారు. మరి కొందరు అశ్వికులు గుర్రాలను ముందుకు దూకించి తమ చేత గల ఈటెలతో కనుమలోకి చొచ్చుకురావడానికి ప్రయత్నిస్తున్న శత్రు అశ్వికులను పొడుస్తున్నారు.

''మహారాజా! సర్పకేతుడు కనుమలోకి ప్రవేశించేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఆ ఇరుకు మార్గంలో వాడిని రెండువైపుల నుంచి ఎదుర్కొని నాశనం చేయటమే మన వ్యూహం.'' అంటూ సేనాని ధీరమల్లుడు చెంగున గుర్రం మీదికి ఎగిరాడు.

చంద్రవర్మ కూడా ఒక్క గెంతున తన అశ్వాన్ని అధిరోహించాడు.

చంద్రవర్మ, ధీరమల్లుడూ కలిసి క్షణాల మీద తమ సైన్యాన్ని రెండుగా భాగించి, కనుమకు రెండు వైపులా నిలబెట్టారు. సుబాహుడు కొద్దిమంది కాల్బల సైనికులతో, అశ్వికులతో కనుమ ద్వార రక్షణకు పూనుకున్నాడు.

క్రమంగా సర్పకేతుడి సైన్యం ఇరుకైన కనుమ ద్వారాన్నుంచి లోపల ప్రవేశించేందుకు గట్టి ప్రయత్నం ప్రారంభించింది. వందల వేల సంఖ్యలో వున్న అతడి అశ్వికులూ, కాలిబంట్లూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, కనుమలోకి తోసుకువచ్చేందుకు ప్రయత్నించసాగారు.



వారిలో చాలా మంది ద్వారం దగ్గిరే సుబాహుడి ఆశ్వికుల ఈటెపోటులకూ, విలుకాళ్ళ అంబుల దెబ్బకూ హతం కాసాగారు. వాళ్ళను తప్పుకొని ముందుకు వచ్చిన సైనికులను, చంద్రవర్మా, ధీర మల్లుడూ తుద ముట్టించుతున్నారు.

పోరాటం యీ విధంగా కొంతసేపు సాగేసరికి, శత్రుసైనికులతోపాటు కొంత మంది చంద్రవర్మ సైనికులు కూడా మర ణించటం జరిగింది. శత్రువులు అసంఖ్యా కులు. తమ సైన్యం బహుకొద్ది. సర్ప కేతుడు మరికొంత సైన్యాన్ని కనుమ ద్వారం మీద దాడికి ఉపయోగిస్తే, తాము చిక్కులో పడిపోగలమని చంద్రవర్మా, ధీరమల్లుడూ ఊహించారు.

వాళ్ళిద్దరూ మార్గాంతరం ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో, సర్పకేతుడి కంచు కంఠం కనుమద్వారం దగ్గిర మార్మోగింది. "ఆ చంద్రవర్మా, ధీరమల్లుడీ తలలు తెచ్చినవాడికి లక్ష వరహాలు యిస్తాను. ఈ పరగణాకంతటికీ సామంతరాజును చేస్తాను. ముందుకు దూకండి. హేయ్!" అంటూ సర్పకేతుడు తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.

కన్ను మూసి తెరిచేంతలో కనుమ ముఖద్వారం భయంకర యుద్ధరంగంగా మారిపోయింది. సర్పకేతుడు యిస్తానన్న బహుమానాన్ని ఆశించిన శత్రుసైనికులు అన్నిటికీ తెగించి సన్నని కనుమద్వారం గుండా లోపలికి వచ్చేందుకు పోటీలు






పడి యుద్ధం చేయసాగారు. సుబాహుడి వద్ద వున్న కొద్ది సైన్యానికి తోడుగా ధీర మల్లుడు మరికొంత సైన్యాన్ని పంపాడు. కాని సర్పకేతుడి సైనికులు చచ్చిన, ఛావనున్న తమ తోటివాళ్ళ మీదుగా గుర్రాలను దూకిస్తూ క్రమంగా ముందుకు తోసుకువస్తున్నారు.

హఠాత్తుగా చంద్రవర్మ తన గుర్రాన్ని ధీరమల్లుడి గుర్రం కేసి దూకించి, ''ధీర మల్లూ! నా కొక ఉపాయం తోస్తున్నది. మనం కొంత సైన్యంతో, ఆ కనబడే రాళ్ళ గుట్టల మీదుగా ఎక్కి అవతలికిపోయి వెనకనుంచి సర్పకేతుడి సైన్యాన్ని ఎదిరించటం బావుంటుంది. ఒకవేళ అవతలికి దిగటం సాధ్యం కాకపోతే, ఆ రాళ్ళ గుట్టల చాటునే వుండి మన విలుకాళ్ళు, శత్రువుల మీద బాణాలు ప్రయోగించవచ్చు. అప్పుడు సర్పకేతుడు తప్పనిసరిగా కొంత సైన్యాన్ని కనుమ ముఖద్వారం నుంచి వెనక్కు మళ్ళించి తీరుతాడు,'' అన్నాడు.

''అవును, మహారాజా! మనం ఈ పరిస్థితుల్లో ఏదో ఒకటి చేసి తీరాలి. శత్రుసైన్యమంతా ఒక్కసారిగా కనుమలో ప్రవేశిస్తే, యిక మనకు పారిపోయేందుక్కూడా మార్గం లేకుండా పోతుంది,'' అన్నాడు సేనాని ధీరమల్లుడు.

చంద్రవర్మ కొందరు విలుకాళ్ళను వెంటబెట్టుకుని, పెద్ద పెద్ద బండరాళ్ళ మీదుగా పాకుతూ పైకెక్కి, కనుమ ముందు వున్న మైదానం కేసి చూశాడు. అతడి కంటబడిన దృశ్యం ఎంత ధైర్యశాలినైనా భీరువుగా చేసేలా వుంది. వందల వేల సంఖ్యలో వున్న సర్పకేతుడి అశ్వ సైన్యం, కాల్బలం కనుమ ముఖద్వారం కేసి వేగంగా కదులుతున్నది. ఇంత గొప్ప సైన్యాన్ని యుద్ధం చేసి ఎలా ఓడించ గలను? అనుకున్నాడు చంద్రవర్మ. మహా అయితే తనూ, ధీరమల్లుడూ, సుబాహుడూ, ముసలివాడి కొడుకు దేవలుడూ శత్రువుల చేత పడకుండా

తప్పించుకుని పారిపోవచ్చు. ఆ తరవాత, తిరిగీ తనకు అరణ్యాలు పట్టుకు తిరిగే జీవితం ప్రారంభమవుతుంది.

చంద్రవర్మ మనసులో ఇలా అనుకుంటూ నిస్పృహగా శత్రుసైన్యం కేసి చూస్తున్నంతలో అతడికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు ఎంతో గుండె నిబ్బరంతో, శత్రుసైన్యం దృష్టికి కనబడేలా ఒక ఎత్తయిన రాతి మీద నిలబడి, ఖంగుమనే కంఠస్వరంతో వాళ్ళనుద్దేశించి యిలా అన్నాడు :



''ఓ సైనికులారా! నేను వీరపుర సామంతుడైన సూర్యవర్మ కుమారుణ్ణి, చంద్రవర్మను! దుష్టుడైన సర్పకేతుడు, మాహిష్మతీ రాజవంశాన్ని ఎంత క్రూరంగా నిర్మూలించి, తను చక్రవర్తి అయాడో మీకందరికీ తెలుసు. నేను తిరిగీ మాహిష్మతీ రాజ్య సింహాసనం మీద యశోవర్ధన చక్రవర్తి సంతానంలో మిగిలివున్న తపోవర్ధనుణ్ణి కూర్చోబెట్ట దలిచాను. ఒకవేళ ఆయన అందుకు సమ్మతించని పక్షంలో మీ కిష్టుడైన మరెవరినైనా సరే చక్రవర్తిని చేయవచ్చు. దుష్టుడూ, కపటీ, క్రూరకర్ముడూ అయిన సర్పకేతుణ్ణి ముందు బంధించాలి. నా వీరపుర సంస్థాన సైనికు లెవరైనా మీలో వుంటే వారికి ఈ పని ఒప్పచెపుతున్నాను.''

చంద్రవర్మ కంఠస్వరం వింటూనే సైనికులంతా ఒక్క నిమిషం స్థాణువుల్లా అయిపోయారు. అతడు మాట్లాడటం ముగించేసరికి, సైన్యంలో ఒక భాగం నుంచి, ''వీరపుర మహారాజుకూ, జై!'' అన్న కేకలు వినిపించినై. ఆ వెంటనే సైన్యంలో అక్కడక్కడా కలకలం, తోసుకోవటాలూ, కుమ్ముకోవటాలూ ప్రారంభమయింది. చూస్తూండగానే సైన్యం నుంచి ఒక పెద్ద సమూహం వేరుపడి, చంద్రవర్మ నిలబడి వున్న చోటుకు రాసాగింది. ఆ వెంటనే ''సర్పకేతు మహారాజుకూ, జై!'' అన్న కేకలు వినిపించినై. చంద్రవర్మ కేసి వస్తున్న అశ్వసైనికులూ,

కాల్బల సైనికులూ చప్పున వెనుదిరిగి, భీకరంగా అరుస్తూ, వాళ్ళ మీదికి దూకారు.

చంద్రవర్మ వెనుదిరిగి కనుమలో వున్న సేనాని ధీరమల్లుడితో, "ధీరమల్లూ! ఇదే మంచి అవకాశం. సర్పకేతుడి సైన్యంలో ఒక పెద్ద భాగం మన పక్షానికి తిరిగింది. వాళ్ళు మిగిలినవాళ్లతో పోరాడుతున్నారు. నువ్వు మన భటులనందరినీ హెచ్చరించి, ఒక్కుమ్మడిగా కనుమ ముఖద్వారం మీద దాడి చేసి బయటి మైదానంలోకి రాగలిగామంటే, సర్పకేతుణ్ణి క్షణాల మీద సర్వనాశనం చేయవచ్చు," అని కేక పెట్టాడు.

సేనాని ధీరమల్లుడు తన అనుచరులను హెచ్చరించేలోపలే, సర్పకేతుడు తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు. తన సైనికుల్లో చాలామంది శత్రుపక్షం వహించి తన మీద కత్తి దూయటం చూస్తూనే, అతడు తన అనుచరులను కనుమ ముఖద్వారం నుంచి వెనక్కు రప్పించి, తనకు ఎంతో విశ్వాసపాత్రులైన మిగతా సైనికులతో కలిసి యుద్ధరంగం వదిలి పారిపోసాగాడు.

చంద్రవర్మా, ధీరమల్లుడూ తమ సైన్యాన్ని కూడదీసుకుని, పారిపోతున్న సర్పకేతుడి సైన్యం వెంటపడ్డారు. ఇరుకైన కొండమార్గాల వెంట, నిటారుగా వున్న పెద్ద పెద్ద రాళ్ళనూ, లోతైన అగాధాలనూ తప్పుకుంటూ చంద్రవర్మ మిట్టమధ్యాహ్నం వేళవరకూ సర్పకేతుడి సైన్యాన్ని తరిమాడు. శత్రుసైనికుల్లో కొద్దిమంది అశ్వికులూ, కాలిబంట్లూ అతడి చేతికి దొరికారు. కాని, ముఖ్య సైన్యంతో సర్పకేతుడు చంద్రవర్మకు అందకుండా కొండల్లో తప్పించుకుని చాలా దూరం పారిపోగలిగాడు.

సేనాని ధీరమల్లుడూ, చంద్రవర్మా సంప్రతించుకుని నలుగురు అశ్వికుల్నీ, పదిమంది భటులనూ, సర్పకేతుడి జాడ తెలుసుకునేందుకు ముందుకు పంపారు.

—(వచ్చే సంచికలో ముగింపు)






# కనకసెట్టి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ, ఎంతో భీతికొలిపే యీ శ్మశానంలో, నువ్వు చేస్తున్న కఠిన శ్రమ చూస్తూంటే, నాకు జాలితోపాటు ఆశ్చర్యం కలుగుతున్నది. ఒకవేళ నువ్వు పూనిన కార్యంలో విజయం సాధించినా, వృద్ధాప్యదశలో, అది నీకు మనశ్శాంతి కలిగిస్తుందన్న నమ్మకం, నాకు లేదు. వయసులో వుండగా ఎంతో శ్రమించి కూడబెట్టిన ధనాన్ని వృద్ధాప్యదశలో మనో దౌర్బల్య కారణంగా సర్వం పోగొట్టుకున్న, ఒక ధనిక వర్తకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



కాంచీపురవాసి అయిన కనకసెట్టి అనే వర్తకుడు, అనేక రకాల వ్యాపారాలు చేసి, లక్షలూ, కోట్లూ గడించాడు. ఓడ వర్తకం, ధాన్యం, అపరాలవంటి వ్యాపారాలలోకన్నా, ముఖ్యంగా వడ్డీవ్యాపారంలో అతడు చెప్పరానంత ధనం ఆర్జించాడు.

తనవద్ద అప్పు తీసుకున్నవాళ్ళనుంచి చక్రవడ్డీలు కట్టి, తీర్చలేనివాళ్ళ చరస్థిరాస్తుల్ని, దయాదాక్షిణ్యం లేకుండా, సొంతం చేసుకునేవాడు. ఇలా సంపాదించిన డబ్బుతో, కనకసెట్టి కూతుళ్ళకు గొప్ప సంబంధాలు చేశాడు. కొడుకులకు ఆస్తిలో భాగాలు పంచి, వాళ్ళచేత సొంతాన వర్తక వ్యాపారాలు ప్రారంభింపచేశాడు.

కాలం గడిచి, కనకసెట్టికి వృద్ధాప్య దశ వచ్చింది. ఆ స్థితిలో అతడికి తాను ఎన్నో పాపాలు చేశాననీ, ఆ కారణంగా మరణానంతరం నరకయాతనలు అనుభవించవలసివస్తుందనీ, భయం పట్టుకున్నది.

ఇలావుండగా, ఒక యోగి కాంచీపుర పరిసరాల్లోని శాంతివనంలో వచ్చి విడిది చేసినట్టు అతడు విన్నాడు. ఆ యోగి గొప్ప మహత్తులుగలవాడనీ, తనను చూడవచ్చినవారి సమస్యలకు తగు పరిష్కార మార్గాలు చెబుతున్నాడనీ, జనం చెప్పుకోసాగారు.

ఒకనాడు కనకసెట్టి శాంతివనం చేరి, యోగికి సాష్టాంగపడిలేచి, తను వచ్చిన పని చెప్పబోయాడు. కాని, యోగి అతణ్ణి వారించి, ''నీ గురించి నాకు సర్వం తెలుసు. నువ్వు చేసిన పాపాలనుంచి విముక్తి పొందడానికి అన్నదానమొక్కటే శరణ్యం. రోజుకు వందమంది చొప్పున, పదివేలమందికి అన్నదానం చేస్తేగాని, నీ పాపాలకు పరిహారం వుండదు,'' అన్నాడు.

యోగి మాటలు వింటూనే కనకసెట్టి వెలవెలపోయాడు. రోజుకు వందమందికి సొంత డబ్బుతో భోజనం పెట్టాలంటే, అతడికి మనసు ఒప్పలేదు.

"స్వామీ, క్షమించండి! అంతమందికి భోజనం పెట్టే స్తోమతు నాకు లేదు. మరేదైనా మార్గం ఆలోచించి చెప్పండి," అన్నాడు.



యోగి చిన్నగా నవ్వి, "ముఖ్యంగా వడ్డీ వ్యాపారంలో, నువ్వు ధనంతోపాటు పాపం చాలా కూడబెట్టుకున్నావు. రోజుకు వందమంది చొప్పున, పదేళ్ళపాటు అన్న దానం చేసినా, నీ ఆస్తి తరగదు; ఆ సంగతి నాకు తెలుసు. అసత్య సంభాష ణతో, నన్ను చిరాకు పరచకు!" అన్నాడు.

కనకసెట్టి, అయనకు జవాబేమీ యివ్వ కుండా తల వంచుకుని వూరుకున్నాడు. యోగి కొంచెంసేపు ఆగి, ఏదో మంత్రం జపించి, ఒక వెండి పాత్రను సృష్టించి, "నువ్వు పాపివేకాదు, పిసినారివి కూడా. సరే, ఈ వెండి పాత్ర యిస్తున్నాను. ఈ పాత్ర నీకు మూడు రోజులు మాత్రమే పనికివస్తుంది. ఈ మూడు రోజులలో నువ్వు, పదివేలమందికి అన్నదానం చేయాలి. గడువు లోపల అలా చేయక పోతే, నువ్వు తల పగిలి మరణించ గలవు," అని, పాత్రను కనకసెట్టికి ఇచ్చాడు.

కనకసెట్టి, ఆ పాత్ర సాయంతో అన్న దానం ప్రారంభించాడు. రాజూ రాత్రి పది గంటలదాకా, అనేకమంది వచ్చి తృప్తిగా భోజనం చేసి వెళుతూండేవాళ్ళు. ఇలా రెండు రోజులు గడిచాక, మూడవ రోజు రాత్రి పది గంటలకు, యోగి చెప్పిన పదివేల సంఖ్యకు పదిమంది తక్కువయ్యారు.

కనకసెట్టి పరుగు, పరుగున వీధిలోకి పోయి, ఎలాగైతేనేం ఒక ఎనిమిదిమందిని పట్టుకు తీసుకువచ్చి, వాళ్ళకు భోజనం పెట్టాడు. ఇప్పుడు పదివేల సంఖ్యకు ఇద్దరు తక్కువయ్యారు.

అప్పటికే చాలా పొద్దుపోయింది. అతడు ఎంత ఆలోచించీ చేసేదిలేక, పాత్ర సాయంతో రెండు విస్తళ్ళల్లో



సెట్టికి ఇది ఎవరో దొంగలు చేసిన పని అన్న అనుమానం కలిగింది. అతడు తాను ధనం దాచుకున్న గదిలోకి పరిగెత్తాడు. అతడి అనుమానం నిజం అయ్యింది. రాత్రి, ఆ విస్తళ్ళల్లో వున్న అన్నం తిన్న ఇద్దరు దొంగలూ, ధనం, నగలూ వున్న పెట్టెను బద్దలుకొట్టి, వాటిని దోచుకుపోయారు.

కనకసెట్టి ఒక క్షణకాలం దిగాలు పడి పోయి, అంతలోనే తేరుకుని, గది నుంచి మెల్లగా బయటికి వచ్చాడు. వీధి వాకిలి దగ్గిర ఎవరో కొందరు తనను పేరుపెట్టి పిలుస్తూ, కేకలు వేయడం వినిపించింది. అతడు గబగబా పోయి తలుపు తెరిచాడు.

వీధిలో చిన్న గుంపొకటి పోగై వున్నది. వాళ్ళల్లోనుంచి పదిమంది, చేతులను తాళ్ళతో బిగించి కట్టిన ఇద్దరు మనుషులను సెట్టి ముందుకు తెచ్చి నిలబెట్టి, "సెట్టిగారూ, వీళ్ళిద్దరూ ఇంతకు కొద్ది సేపు ముందు, మీ ఇంటి పెరటిలోనుంచి బయిటికి వస్తూంటే, అనుమానించి పట్టుకున్నాం. వీళ్ళు దొంగలు. వీళ్ళ దగ్గిర వున్న రెండు మూటలూ విప్పి చూడండి," అన్నారు.

సెట్టి అలాగే చేశాడు. వాటిలో దొంగలు తన ఇంట దోచిన ధనం కనబడింది. అతడు తానే స్వయంగా రెండు మూటల

భోజనం పెట్టి, వాటిని వంటగదిలో వుంచి, తన ప్రాణాలకు ముప్పు తప్పదనుకుంటూ పోయి, తన పడక గది చేరి నిద్ర పోయాడు.

కొంతసేపటికి తెల్లవారింది. పక్షులు చేసే కలకలారావాలూ, వీధిన పోయే జనం, వాహనాలూ చేసే శబ్దం విని కనక సెట్టి కళ్ళు తెరిచాడు. ఇంకా తను బతికి వున్నందుకు, అతడికి ఎక్కడలేని సంతోషంతోపాటు, ఆశ్చర్యం కలిగింది. వెంటనే వంటగదిలోకి పరిగెత్తాడు.

అక్కడ రాత్రి అతడు రెండు విస్తళ్ళలో పెట్టిన అన్నం ఎవరో తినేశారు, అక్కడ వుండవలసిన వెండి పాత్ర లేదు.

మూతులూ బిగించి, ఆప్యాయంగా దొంగ భుజాలు తట్టి, ''భయపడకండి, ఈ ధనం మీదే!'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కనకసెట్టి ప్రవర్తన గురించి నీ అభిప్రాయం ఏమిటి? అడ్డమైన అన్యాయాలూ, పాపాలూ చేసి కూడబెట్టిన ధనాన్ని, అతడు ఆ విధంగా దొంగలపాలు చేశాడు. ఇది వృద్ధాప్యదశలో కలిగిన మనో దౌర్బల్యంవల్లనేకదా? లేక, ఆ ఇద్దరు దొంగలూ తనను ప్రాణాపాయం నుంచి కాపాడారన్న కృతజ్ఞతా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కనకసెట్టి, యోగిని దర్శించింది, ప్రాణ భయంవల్ల కాదు, నరకభయంవల్ల. ఆ సంగతి గమనించడం చాలా ముఖ్యం! తను చేసిన పాపాలకు పరిహారం జరక్కుండానే మరణించి, నరకానికి పోవలసివస్తున్నదన్నదే అతణ్ణి పట్టి పీడిస్తున్న సమస్య. దానికి యోగి పరిష్కారమార్గం చెప్పాడు. అయితే, తాను మూడు రోజుల్లో పది వేల మందికి అన్నదానం చేయాలి. కాని, మూడోనాడు పదివేలమందికి ఇద్దరు తగ్గారు. అంటే, యోగి చెప్పినట్టు, ఆనాడు తాను మరణిస్తాడు. పదివేల మందికి అన్నదానం చేయడంలో విఫలమైన కారణంగా, తనకు నరకబాధలు తప్పవని అతడనుకున్నాడు. అయితే, అదృష్టవశాత్తూ దొంగలిద్దరివల్లా, ఆ ప్రమాదం తప్పింది. అంటే, ఇక తనకు నరకబాధల భయంలేదు. ఆ కారణం వల్లనే, అతడు దొంగలకు తన ఇంట దోచిన ధనాన్ని ఆదరపూర్వకంగా దానం చేశాడు. కనకసెట్టిది ప్రాణభయం కాదు, నరకభయం. అతడిలో మనో దౌర్బల్యం వున్నదనుకోవడం పొరబాటు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# దొంగలవిందు

భీమశంకరం అనే యువకుడు, పొరుగు గ్రామంలో వున్న బంధువుల ఇంటికి పెళ్లికి వెళ్ళి, సూర్యాస్తమయ సమయంలో, స్వగ్రామానికి బయలుదేరాడు. అతడు ఒక అడవిదారి వెంట నడుస్తూండగా, హఠాత్తుగా వాన ప్రారంభమైంది. అతడు తల దాచుకునేందుకు దిక్కులు చూస్తూండగా, సమీపంలో ఒక పాడుబడిన సత్రం కనిపించింది.

భీమశంకరం సత్రంలోకి వెళ్ళి, అక్కడ ఒక గదిలో కూర్చున్నాడు. ఆ సమయంలో పాతికమంది దొంగలు, తమ నాయకుడి వెంట ఆ సత్రం చేరారు.

దొంగలు తమ గుర్రాలు దిగి, వెంట తెచ్చిన కట్టెలూ, బియ్యం, పప్పు దినుసులూ సత్రంలోకి మోసుకుపోసాగారు. వాళ్ళ నాయకుడు, వాళ్ళతో, "ఈ గాలి వాన ఇప్పట్లో తగ్గేట్టులేదు. ఈ రాత్రి మనం ఇక్కడ గడపవలసిందే. మంచి విందుభోజనం తయారు చెయ్యండి," అన్నాడు.

వెంటనే నలుగురు దొంగలు పొయ్యిలు ఏర్పాటుచేసి, మూడు గంటలలో విందు భోజనం సిద్ధం చేశారు. కొంచెం దూరంగా వున్న చీకటి గదిలోని భీమశంకరానికి, వంటలవాసన ముక్కుకుసోకి, నోరూరి బాగా ఆకలిపుట్టసాగింది.

భీమశంకరం సహజంగా ధైర్యవంతుడు, తెలివిగలవాడు. అతడు నెమ్మదిగా గదిలో నుంచి బయటికి వచ్చి, దొంగలు చూడకుండా వాళ్ళ దుస్తుల మూటలోంచి ఒక జత బట్టలు తీసుకుని ధరించి, అచ్చుగా దొంగలాతయారయాడు.

దొంగల భోజనానికి ఒక గదిలో విస్తళ్లు వేయబడ్డాయి. అక్కడ ఒక చిన్న దీపం బుడ్డి వెలిగించారు. అది మినుకు,

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



మినుకుమంటున్నందున, గదిని వెలుగు కన్న చీకటి ఎక్కువగా ఆవరించింది.

దొంగల నాయకుడు ఆ వేసిన విస్తళ్ళ కేసి ఒకమారు చూసి, "మనం ఇరవై ఆరుగురం కదా! నలుగురు వంటచేస్తే, మిగిలినవాళ్ళం ఇరవైయిద్దరం. ఆ నలుగురూ వడ్డిస్తున్నారు. మరి యిక్కడ ఇరవైమూడు విస్తళ్ళు వేసుకుని— అందరం కలిపి ఇరవైఏడుమందిమి అయ్యాం ఏమిటి? మనలో ఎవడో పరాయి వాడు వచ్చి కలిసినట్టున్నది," అన్నాడు.

ఆ మాటలకు దొంగలు విస్తుపోయి, ముఖముఖాలు చూసుకుంటున్నంతలో, వాళ్ళ నాయకుడు, "ఆ పరాయివాణ్ణి పట్టడం చాలా సులువు. అందుకొక మార్గం వున్నది!" అని, తన ముఖ్య అనుచరుణ్ణి దగ్గిరకు పిలిచి, మిగతా దొంగలతో, "మేం యిద్దరం, యీ పక్క గదిలో వుంటాం. మీరు ఒక్కొక్కరూ, ఆ గదికి రండి. నేను యీ కాలుస్తున్న చుట్టతో వాత పెడతాను. దానికి ఓర్చుకోలేక ఎవడైతే పెడబొబ్బలు పెడతాడో, వాడు పరాయివాడు. వాణ్ణి చెట్టుకొమ్మకు వేళ్ళాడదీస్తాను," అన్నాడు.

తరవాత దొంగల నాయకుడూ, వాడి ముఖ్య అనుచరుడూ పక్క గదిలోకి వెళ్ళారు. ఒక్కొక్క దొంగా ఆ గదిలోకి వెళ్ళిన కొద్దిసేపటికి, అబ్బా అని చిన్న మూలుగు మాత్రం వినిపిస్తున్నది.

ఇది గమనించిన భీమశంకరం, దొంగల నాయకుడు ఎవరికీ చుట్టతో కాల్చి వాతలు పెట్టడం లేదనీ, మరేదో ఎత్తువేశాడనీ అనుకున్నాడు. అతడు గదిలోకి వెళ్ళగానే నాయకుడి ముఖ్యానుచరుడు, అబ్బా అని చిన్నగా మూలిగి, భీమశంకరాన్ని గోడ వారగా కూర్చోబెట్టాడు. కొద్దిసేపటికి అందరు దొంగలవంతూ అయింది.

అప్పుడు దొంగల నాయకుడు వాళ్ళతో, "మన మధ్య చేరిన ఆ పైవాడెవడో జిత్తుల మారి వెధవలా కనిపిస్తున్నాడు. వాడి మీద నా ఎత్తుగడ పారలేదు. ఈసారి వాణ్ణి

పట్టేస్తాను. నేను ఆ గదిలో వుంటాను. మీరు ఒక్కొక్కరే వచ్చి, ఈ రాత్రి మన సంకేతం ఏమిటో చెప్పిపొండి,'' అన్నాడు.

దొంగల్లో ఒక్కడొక్కడే తమ నాయకుడున్న గదిలోకి వెళ్ళసాగారు. వాళ్ళ సంకేతమేమిటో తెలియని భీమశంకరానికి భయం పట్టుకున్నది. అంతలో అతడికి వంటవాళ్ళల్లో ఒకడు తోటివాణ్ణి, మతిమరుపువెధవా అనడం గుర్తుకువచ్చింది.

భీమశంకరం వాణ్ణి సమీపించి, చెవిలో, ''అసలే నువ్వు మతిమరుపువాడివి. ఆ సంకేతం మరిచిపోలేదుగదా?'' అన్నాడు.

దానికి వాడు కోపం తెచ్చుకుని, ''లంబాలుంబా! ఎంత మతిమరుపయినా, ఆ మాత్రం గుర్తుపెట్టుకోలేనా!'' అన్నాడు.

భీమశంకరం సంతోషించి తన వంతు రాగానే దొంగల నాయకుడి దగ్గిరకు వెళ్లి, ''లంబాలుంబా!'' అని చెప్పాడు.

దొంగలందరూ సంకేతం చెప్పడం ముగియగానే, దొంగల నాయకుడు, ''ఆహాం, మనలో చేరినవాడెవడో, మహా బుద్ధిశాలిలా వున్నాడు. అలాంటి వాళ్ళంటే, నాకు చాలా గౌరవం. అతను ముందుకు వచ్చి, నిజం చెబితే, చక్కని విందుభోజనం పెట్టి, బహుమతి కూడా యిచ్చి మరీ వదిలేస్తాను. ఈ మాట ప్రమాణం చేసి చెబుతున్నాను,'' అన్నాడు.

ఆ వెంటనే భీమశంకరం ముందుకు వచ్చి, దొంగల నాయకుడికి జరిగింది చెప్పి, ''అసలే ఆకలితో వున్నాను. దానికి తోడు మీ వంటకాల వాసన నన్నింత సాహసానికి పురిగొల్పింది,'' అన్నాడు.

ఆ మాటలకు దొంగల నాయకుడు పెద్దగా నవ్వి, ''ఆ వంటకాల వాసనే కాదు, రుచి కూడా ఎంత అద్భుతంగా వుంటుందో యిప్పుడే చూద్దువుగాని. రా, నా సరసన కూర్చుని విందుభోజనం చేద్దువుగాని,'' అన్నాడు.

దొంగల నాయకుడు, భీమశంకరానికి తృప్తిదీరా భోజనం పెట్టించి, తెల్లవారుజామున వెళ్ళిపోయేప్పుడు, అతడికి పది బంగారు కాసులు బహూకరించాడు.






మన దేవాలయాలు :

# సోమనాథ ఆలయం

పురాణ గాథల ప్రకారం, ఒకప్పుడు చంద్రుడికి వృద్ధి క్షయాలు ఉండేవి కావు. సంవత్సరం పొడవునా, ప్రతి రేయీ చంద్రుడు పూర్ణ కాంతితో వెన్నెల వెదజల్లే వాడు.

చంద్రుడు దక్షప్రజాపతి అల్లుడు. ఒక సారి, చంద్రుడు ధర్మమార్గాన్ని అతిక్రమించడంతో మామగారి ఆగ్రహానికి గురి అయ్యాడు. దక్షుడు కోపావేశంతో అతణ్ణి "క్షీణించిపోదువుగాక!" అని శపించాడు.





చంద్రుడు పూర్తిగా క్షీణించకముందే, ఇతర దేవతలు, శాపాన్ని ఉపసంహరించమని దక్షుణ్ణి కోరారు. అయినా దక్షుడు శాపాన్ని ఉపసంహరించుకోకుండా దాని ఉధృతాన్ని కొంత తగ్గించాడు. దాని ప్రకారం చంద్రుడికి ఒక నెలలో పదిహేను రోజులు క్షయమూ, పదిహేను రోజులు వృద్ధీ ఉంటాయి.




అయినా ఇది జరగడానికి, పవిత్రసముద్ర జలంలో స్నానం చేస్తూ శివుణ్ణి ప్రార్థించవలసిందిగా, దేవతలు చంద్రుడికి సలహా ఇచ్చారు. అతడు అలాగే చేశాడు. పోగొట్టుకున్న ప్రకాశాన్ని చంద్రుడు మళ్ళీ అక్కడ పొందగలిగాడు గనుక, ఆ స్థలానికి ప్రభాసక్షేత్రం అని పేరు వచ్చింది.

చంద్రుడు కొంతకాలం ప్రభాసక్షేత్రంలో శివుణ్ణి పూజించడం విన్న ప్రజలు, క్రమంగా అక్కడి శివుణ్ణి సోమనాథుడు అన్న పేరుతో పూజించడం ప్రారంభించారు.





ప్రభాసక్షేత్రంలో ప్రప్రథమంగా శివాలయం ఎప్పుడు నిర్మించబడిందో తెలియదు. క్రీ॥ శ॥ 6–7 శతాబ్దాలలో ఆ ప్రాంతాన్ని పరిపాలించిన నాలుగవ ధారాసేనుడి కాలంలో ఆ గుడి శిథిలావస్థలో కనిపించగా, ఆ రాజు అక్కడ నూతన ఆలయం నిర్మించాడు.

9 వ శతాబ్దంలో ఆలయ పునర్నిర్మాణం జరిగింది. అప్పటి నుంచి అది సుప్రసిద్ధ యాత్రాస్థలంగా పేరుగాంచింది. దేశం నలుమూలలనుంచి భక్తులు ఆ దేవాలయాన్ని దర్శించసాగారు. రాజులు, సామాన్య ప్రజలు తమ తమ శక్త్యను సారం బంగారు ఆభరణాలను ఆలయానికి సమర్పించారు. ఆలయ ప్రాంగణం చుట్టూ, దుకాణాలు, వసతిగృహాలు ఏర్పడసాగాయి.





పదకొండవ శతాబ్దారంభంలో గజనీ మహమ్మద్ భారతదేశం మీద దండయాత్ర చేశాడు. సోమనాథ ఆలయంలో ఉన్న రత్నరాసుల గురించి విన్న గజనీమహమ్మద్ దానిని ముట్టడించాలని, తన సైన్యాన్ని ఆలయం కేసి నడిపించాడు. ఈ విషయం అక్కడి పౌరులకు తెలియవచ్చింది.

ఆలయ రక్షణకోసం, ఆ ప్రాంత పాలకుడు తన సైనికులను పంపాడు. అయినా అసంఖ్యాకులైన గజనీ సైనికులను వారు అట్టేకాలం ఆపలేక పోయారు. సామాన్య పౌరులు సైతం, దురాక్రమణదారులను ఎదుర్కొని పోరాడి ప్రాణాలు అర్పించారు.





# నాగకిరీటం

ఒకప్పుడు స్విజర్లాండులో ఒక రాజుండేవాడు. ఆయనకు ఒకతే కూతురు. కొడుకులు లేరు. ఎందరు దేవుళ్ళకు మొక్కుకున్నా ఆయనకు పుత్ర సంతానం కలగనే లేదు. అందుచేత ఆయన ఆ కూతురినే కొడు కనుకుని ఎంతో ప్రేమగా చూసుకుంటూ వచ్చాడు.

ఒకనాడు తండ్రీ కూతుళ్ళు షికారు వెళుతూండగా ఒక ముసలిది ఒక పామును ముద్దులాడుతూ కనిపించింది. అది చూసి రాజు కూతురు, "ఛీ, ఛీ! ఎంత అసహ్యం!" అన్నది.

ఈ మాట విని ముసలిది మండిపడి, అసహ్యంతో రాజకుమార్తెను ఎగా దిగా చూసి, "ఈ ప్రాణిని చూసి అంత ఏవగించుకున్నావు గనక, నీవు కూడా దీనిలాగే బ్రతుకు," అంటూ తన కుడిచేతిలో ఉన్న పుల్లతో రాజకుమార్తెను తాకింది. రాజు ముసలిదానికి అడ్డుపడే లోపల ఈ దారుణం జరిగిపోయింది. రాజకుమార్తె పాముగా మారి, తల ఎత్తి తండ్రికేసి దీనంగా చూసింది.

ముసలిది అంతటితో పోనివ్వక, "ఇంక నీకు తండ్రితో ఏం పని? వెళ్ళి పాములాగా జీవించు," అంటూ ఆ పామును మళ్లీ పుల్లతో తాకింది. ఆ పాము చరచరా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

అంతవరకూ కొయ్యబారి చూస్తూ నిలబడిపోయిన రాజు ఆగ్రహంతో కత్తి దూసి ముసలిదాన్ని చంపబోయాడు. అది భయపడక చేతిలోని పుల్ల పైకెత్తి, "జాగ్రత్త, నీ కూతురికి పట్టిన గతే నీకూ పట్టగలదు." అని బెదిరించింది.

జుట్టు అందకపోయేసరికి రాజు కాళ్ళబేరానికి వచ్చి, కనికరించమని ముసలిదాన్ని శతవిధాల వేడుకున్నాడు.

స్విజర్లాండ్ జానపద కథ



దేవాలయంలోని స్వర్ణ ఆభరణాలనూ, రత్నరాసులనూ తీసుకుని, మూలవిగ్రహాన్ని వదిలిపెట్టమని, ఆలయ పూజారులూ, భక్తులూ దురాక్రమణదారులను ప్రార్థించారు. అయినా గజనీమహమ్మదు సైనికులు వారి మాటలు పట్టించుకోకుండా, నిరాయుధులైన వాళ్ళనందరినీ నిర్దాక్షిణ్యంగా చంపివేశారు.

యాభై వేలమంది ప్రాణాలు తీశాక, మహమ్మదు సేనలు ఆలయంలోకి జొరబడగలిగాయి. ఆలయాన్నీ, ఆలయంలోని విగ్రహాన్నీ నాశనం చేసి, దేవాలయం నుంచి తాము అనుకున్న దానికన్నా ఎక్కువ ధనరాసులను కొల్లగొట్టుకుని పోయారు.







ఆ ముట్టడి తరవాత నిర్మించబడిన ఆలయం పదమూడవ శతాబ్దంలో అల్లా ఉద్దీన్ ఖిల్జీ చేత నాశనం చేయబడింది. ఆ తరవాత నిర్మించబడిన దేవాలయం, పద్దెనిమిదవ శతాబ్దంలో ఔరంగజేబు ఆనతిప్రకారం నేలమట్టం చేయబడింది. ఆటుపైన ఇండోర్ రాణి అహల్యాబాయి ఆలయాన్ని పునర్నిర్మించింది. ఇటీవల నిర్మించబడిన మరొక నూతన ఆలయానికి 1951వ సంవత్సరం ప్రారంభోత్సవం జరిగింది.



''నాకు మంత్రాలు వేయటం చేత నవునుగాని మంత్రాలు విప్పటం చేత కాదు. నా చేతిలో ఉన్న దేమిటంటే నీ కూతురిని నాగులకు రాణి చెయ్యగలను. అప్పు డామె జీవితం ఒక్క పిసరు మెరుగుగా ఉంటుంది. ఆమె కోసం ఒక బుల్లి కిరీటం చేయించి మూడు రోజుల తరవాత ఇక్కడికే తీసుకువచ్చి నాకియ్యి. నీ కూతురు ఆ కిరీటం కరిగిపోయేదాకా పాముగా ఉండి, ఆ తరవాత మానవ రూపు పొందుతుంది. మేలిమి బంగారంతో కిరీటం చేయించు. కలితీ బంగారం నీటిలో ఎప్పటికీ కరగదు,'' అన్నది మంత్రాల ముసలిది.

రాజు ఒక్క నిట్టూర్పు విడిచి, ఇంటికి వెళ్ళి బుల్లి కిరీటం చేయించి తెచ్చి ముసలిదానికి ఇచ్చాడు. అది రాజకుమార్తెకు చేరింది. త్వరలోనే ఆ కిరీటం మహత్తు అందరికీ తెలిసిపోయింది. అది ఉన్నచోట లేమి ఉండదు. ధాన్యం గాదెలో దాన్ని ఉంచితే గాదె నుంచి తరగకుండా ధాన్యం తీసుకోవచ్చు. డబ్బు మధ్య దాని నుంచితే ఆ డబ్బు తరగదు. అందుచేత ఆ కిరీటాన్ని ఎలాగైనా సంపాదించాలని చాలామంది ప్రయత్నించారు.

ఒకనా డొక పేద రైతు అరణ్యంలో ప్రయాణం చేసి వస్తూ, దాహం అయి, ఒక కొలనులో మంచినీరు తాగటానికి ఆగాడు. నీటిలో అతని కొక పెద్ద పాము ఈదుతూ కనిపించింది. కొలను ఒడ్డున అతనికి ఒక బుల్లి కిరీటం ధగధగా మెరుస్తూ కనిపించింది. అదే నాగకిరీటమై ఉంటుందని ఊహించి, ఆ రైతు దాన్ని తీసుకుని తన దారిని బయలుదేరాడు. త్వరలోనే ఆ పెద్దపామూ, మరికొన్ని ఇతర పాములూ తన వెంట పడటం గమనించి ఆ రైతు చప్పున సమీపంలో ఉన్న పెద్ద చెట్టు మీదికి ఎగబాకాడు.

వాడు చెట్టు దిగి రావటానికి లేకుండా పాములు చెట్టు మొదట్లో బుసలు కొడుతూ అటూ ఇటూ తారాడాయి.

ఇంతలో ఎవరో ఒక స్త్రీ అటుగా వచ్చి వాణ్ణి చూసి, "ఎందుకు చెట్టెక్కావు, బాబూ?" అని అడిగింది.

వాడు జరిగిన సంగతంతా ఆ స్త్రీకి వివరంగా చెప్పి, "నిన్ను పాములు ఏమీ చెయ్యకపోవటానికి ఏమిటి కారణం?" అని అడిగాడు.

"నాకు పాము మంత్రం వచ్చు. పాములు నన్నేమీ చెయ్యవు. నాకా నాగ కిరీటం ఇస్తే ఈ పాములన్నిటినీ పంపేస్తాను. నీ ప్రాణాలు కాపాడుకో వచ్చు," అన్నది ఆ ఆడమనిషి.

"ఆ సంగతి తరవాత చూస్తాం. ముందు పాముల్ని ఇక్కణ్ణించి పంపెయ్యి," అన్నాడు రైతు.

ఆడది ఏదో మంత్రం చదివేసరికి, పాములు తమ దారిన వెళ్ళిపోయాయి. తరవాత రైతు మరు నిమిషంలోనే మెల్లగా చెట్టు దిగి వచ్చి, "నేను సంసార భారం మోసేవాణ్ణి. నాకు ఈ కిరీటం చాలా ఉపయోగిస్తుంది. కావలిస్తే నీవు కూడా నీవాళ్ళతో వచ్చి ఎంత కాలమైనా సరే నా ఇంటనే ఉండు. నీకే లోటూ రాకుండా చూస్తాను," అన్నాడు.

విధిలేక ఆ ఆడది ఒప్పుకున్నది. ఆమె ఒంటరి మనిషి.

రైతు నాగకిరీటాన్ని తెలివిగా ఉపయోగించుకుంటూ ధనధాన్యాలతో చాలా కాలం తులతూగాడు. ఆ ఆడమనిషికి నాగకిరీటం ఎక్కడ ఉన్నదీ తెలియలేదు.



చివరకామె ఆ రహస్యం కనిపెట్టి రైతు ఇంట లేనప్పుడు దాన్ని తీసుకుని తన ఇంటికి పారిపోయింది. ఆమె ఇల్లెక్కడో రైతుకు తెలియదు.

ఇప్పుడు అదృష్టం ఆ అడమనిషికి పట్టుకున్నది. ఆమె నాగకిరీటాన్ని తన ధాన్యపు గాదెలో ఉంచి తరగని ధాన్యంతో చాలా డబ్బు సంపాదించుకున్నది. కాని, ఒకనాడు ఆమె ధాన్యాన్ని పిండి మరకు పంపటంలో నాగకిరీటం కూడా ధాన్యంతో పాటు మరకు వెళ్ళిపోయింది.

ఆ ధాన్యాన్ని మరలో పోసి మర యజమాని ఆడించటం మొదలుపెడితే ఎంతసేపు గడిచినా పిండి తయారవుతూనే ఉంది. ఇందులో ఏదో విపరీతం ఉన్నదనుకుని ధాన్యం అరలో వెతకగా నాగకిరీటం దొరికింది. మరవాడు అమితానందంతో దాన్ని తీసుకుపోయి రహస్యంగా తన గల్లాపెట్టెలో దాచాడు. ఇంతలో అడది వచ్చి తన నగ, ధాన్యంతో బాటు మరకు వచ్చిందని తగూలాడింది. తన కేమీ తెలియదన్నాడు మరవాడు. ఆడది మర అంతటా వెతికి, నాగకిరీటం దొరకక్క, నిరాశ చెంది వెళ్ళిపోయింది.

మరవాడికి ఒక గొప్ప ఆలోచనతట్టింది. నాగకిరీటాన్ని ధాన్యపు అరలోనే ఉంచేస్తే కొద్ది ధాన్యాన్ని ఏళ్ళతరబడి ఆడి అంతులేని పిండి పట్టి, దాన్ని అమ్మి అంతులేని డబ్బు సంపాదించవచ్చు. కొంతకాలం పాటు మరవాడు ఇలాగే డబ్బు చేసుకున్నాడు. అయితే ఒకనాడు ప్రమాదం జరిగిపోయింది. నాగకిరీటం ధాన్యంతో బాటు తిరగలిరాళ్ళ మధ్యకు పోయి పొడి పొడి అయిపోయింది.

మరలో ధాన్యం కాస్తా అడుగంటాయి. పిండి నిలిచిపోయింది.

నాగకిరీటం నిర్మూలమైన మరు క్షణంలోనే, నాగరాణిగా జీవిస్తూ ఉండిన రాజకుమార్తెకు ఎప్పటి అందమైన మానవ రూపం వచ్చేసింది. ఆమె తన తండ్రిని చేరుకుని, తగిన వరుణ్ణి పెళ్ళాడి సుఖంగా ఉన్నది.






దివోదాసు వద్దకు వెళ్ళిన బ్రహ్మ కూడా తిరిగి రాకపోయేసరికి శివుడు ప్రమథులను కాశీకి పంపాడు. కాశీక్షేత్రంలోని మహత్తు ఎలాటిదోగాని, ప్రమథులు కాశీ చేరుతూనే తాము వచ్చిన పని పూర్తిగా మరిచి పోయారు. వారిలో కపర్ది అనేవాడు కపర్దీశ్వరలింగాన్ని ప్రతిష్ఠించాడు.

మందరగిరి మీద ఉన్న శివుడికి కాశీ వార్త అయినా తెలియరాలేదు. ఆయన వినాయకుణ్ణి పిలిచి, అతనికి చెప్పవలసిందంతా చెప్పి, కాశీనగరానికి పంపాడు.

వినాయకుడు కాశీనగరం చేరి అక్కడ అనేక ఉత్పాతాలు కలగజేశాడు. తరవాత అతను దివోదాసు భవనంలో ప్రవేశించి, రాజు అడిగిన ప్రశ్నలన్నిటికీ సరి అయిన సమాధానాలు చెప్పి, రాజపురోహితులలో ఒకడుగా చేరిపోయాడు. రాజు ఒకనాడు ఢుంఠి భట్టారకుణ్ణి, ''కాశీనగరంలో ఉత్పాతా లెందుకు కలుగుతున్నాయి ?'' అని అడిగాడు.

''రాజా, కొంత కాలంపాటు నువు కాశీ విడిచి దూరంగా ఉండటం మంచిదని నాకు తోస్తున్నది. ఇంక పద్దెనిమిది రోజులకు ఉత్తరదేశంనుంచి ఒక బ్రాహ్మణుడు వస్తాడు. నీకు తగిన హితోపదేశం ఆయన చేయగలడు,'' అన్నాడు ఢుంఠి.

తరవాత శివుడు విష్ణుమూర్తిని కాశీకి పంపించాడు. విష్ణువు బుద్ధుడి రూపంలో వచ్చి కాశీ పౌరులకు నాస్తిక మతమూ, బౌద్ధ, జైన ధర్మాలూ బోధించి, వారిలో

15. కాశీక్షేత్రంలో వ్యాసుడు



ధర్మచింత పోగొట్టాడు. తరవాత ఆయన బ్రాహ్మణ వేషం ధరించి దివోదాసుడి వద్దకు వెళ్ళి, ఆశీర్వదించాడు. దివోదాసుడు ఆయనతో, "అయ్యా, దేవతలు నన్ను చాలా రకాల బాధలు పెట్టుతున్నారు. నేను కూడా చాలాకాలం రాజ్యం చేసి, ముసలివాణ్ణి అయిపోయాను. నాకు మోక్షం ఎలా వస్తుంది?" అని అడిగాడు.

"రాజా, కాశీనగరంలో లింగ ప్రతిష్ఠ చెయ్యి. నువు బొందితో కైలాసానికి పోతావు," అన్నాడు విష్ణువు.

ఆ ప్రకారమే దివోదాసుడు తనకుమారుడైన సమరంజయుడికి పట్టం గట్టి, గొప్ప గుడి కట్టించి, అందులో లింగ ప్రతిష్ఠ చేసి, తనకోసం వచ్చిన విమానం ఎక్కి, బొందితో కైలాసానికి వెళ్ళిపోయాడు. కాశీ విడిచి వెళ్ళిన దేవత లందరూ తిరిగి వచ్చారు. శివుడు నందివాహనం మీద తన గణాలతో కాశీనగరానికి మళ్ళీ చేరుకుని ఎంతో తృప్తిపడ్డాడు.

విశ్వనాథుడూ, విశాలాక్షి కాపురం ఉంటున్న కాశీనగరంలో కొంతకాలం నివసించుదామన్న కోరికతో వేదవ్యాసుడు తన శిష్యగణంతో సహా కాశీకి చేరాడు. ఆయన శిష్యులలో వైశంపాయనుడూ, జైమినీ, పైలుడూ, సుమంతుడూ మొదలైన మహామహులు ఎందరో ఉన్నారు.

వాళ్ళు ఉదయాన కాలకృత్యాలు తీర్చుకుని, గంగాస్నానం చేసి, సంధ్య వార్చి, గాయత్రీజపం చేసి, అగ్నికార్యం అయాక, ఊళ్లో భిక్షాటన చెయ్యటానికి తలా ఒక దారినా బయలుదేరారు.

ఆ సమయంలో విశ్వేశ్వరుడు విశాలాక్షితో, "వ్యాసుడి మనస్సు ఎలాటిదో చూస్తాం. అతనికీ, అతని శిష్యులకూ భిక్ష పుట్టకుండా చెయ్యి," అన్నాడు.

విశాలాక్షి సరేనని, కాశీనగరంలో ఏ ఇల్లాలికీ భిక్ష పెట్టే ఇచ్ఛ లేకుండా చేసింది. దాని ఫలితంగా వ్యాసుడు "భిక్షాం దేహి," అని అరుస్తూ ఇల్లిల్లూ తిరుగుతూ ఉంటే, ఇల్లాళ్ళు, "వంట కాలేదు,"



అనీ, మళ్ళీ రమ్మనీ, "ఇవాళ మా ఇంట ఆబ్దికం," అనీ అన్నారు,

వ్యాసుడికి జరిగినట్టే ఆయన శిష్యులకూ జరిగింది. పొద్దు వాలేదాకా ఊరంతా చెడతిరిగి, కాలుతున్న కడుపులతో అందరూ మఠానికి చేరుకున్నారు.

"నాకు ఎక్కడా ఒక్క మెతుకు పుట్టలేదు: మీకైనా భిక్ష దొరికిందా?" అని వ్యాసుడు తన శిష్యులను అడిగాడు. వాళ్లు దొరకలేదన్నారు.

"పొద్దునే లేచి ఏ పాపాత్ముడి ముఖం చూశామో!" అన్నాడు వ్యాసుడు.

ఏడు రోజులు వరసగా ఇలాగే జరిగింది. ఎనిమిదో రోజు వచ్చింది. మళ్లీ నిత్యకృత్యాలు తీర్చుకుని, కాశీలోని దేవుళ్ళ కందరికీ దణ్ణాలు పెట్టుకుని, వ్యాసుడూ ఆయన శిష్యులూ తలా ఒక దారినా భిక్షాటనకు బయలుదేరారు.

వ్యాసుడికి ఒక్క ఇంటా భిక్ష దొరకలేదు. ఆయనకు పట్టరాని ఆగ్రహావేశం వచ్చింది. నుదిటి మీద చెమట పట్టింది. కణతలు అదురుతున్నాయి. ఆయన నడివీధిలో తన భిక్షాపాత్రను రాళ్ళకేసి కొట్టి పగలగొట్టి, కాశీలో మూడు తరాల వాళ్లకు విద్యా, ధనమూ, భక్తీ లేకుండా పోవాలని శాపం పెట్టటానికి కమండలంలో నుంచి శాపజలం అందుకోబోయాడు. కాని అదేం చిత్రమో, చెయ్యి వణికిపోతూ ముందుకు రాకపోయింది.

అంతలో ఆ వీధిలో ఉన్న ఒక ఇంటి తలుపు తెరుచుకుని యాభై ఏళ్ళ స్త్రీ, సర్వాభరణ భూషితురాలు, బయటికి వచ్చి, "ఓ బ్రాహ్మడా, శాపం వద్దు! ఇలా రా!" అని పిలిచింది.

వ్యాసుడు పరమానందభరితుడై, ఆ స్త్రీ ఎవరో, ఏ కులమో కూడా తెలుసుకోకుండానే, ఆమెకు నమస్కారం చేశాడు. ఆయన దగ్గిరికి రాగానే ఆమె, "భిక్ష దొరకనంత మాత్రాన కాశీనగరాన్ని శపిస్తావా? నీ మనశ్శుద్ధి తెలుసుకోవటానికి విశ్వనాథుడు ఇలా చేశాడు గాని, కాశీ



నగరంలో తిండికి లోటేమిటి? మధ్యాన్నం అతిథివేళప్పుడు అన్నపూర్ణ అభ్యాగతులకు బంగారు గరిటెతో అమృతపాయసం ఇస్తుందని నువు వినలేదా? ఏడు రోజులు అన్నం లేదని ధీరత్వం కోల్పోయి, శివుడి రెండో భార్యలాటి కాశీని నాశనం చెయ్యజూశావు. ఆకలి ఎంత పాపమైనా చేయిస్తుందన్నమాట నువే నిరూపించావే! భిక్ష పెడతాను రా," అన్నది.

ఆ మాట విని వ్యాసుడు, "తల్లీ, ఇన్నాళ్ళకు ఇంత తియ్యని మాట చెవుల బడింది. భిక్షకు నన్ను ఒక్కణ్ణే రమ్మన్నావా, లేక ఆకలి మీద ఉన్న నా శిష్యులను కూడా వెంట తెమ్మన్నావా? అందరివీ ప్రాణాలే గద! మా అందరికీ నువు నీకు తోచిన భిక్ష పెట్టితే అందరమూ పంచుకు తింటాం," అన్నాడు.

ఆ మాటకు ఆమె చిరునవ్వు నవ్వి, "నాయనా, మధ్యాన్న పూజలు గంగ వద్ద ముగించుకుని మీరందరూ రండి. అందరికీ భోజనం పెడతాను," అన్నది.

వ్యాసుడు తన మూడువందలమంది శిష్యులతో గంగకు వెళ్ళి, మధ్యాహ్నికాలు ముగించుకుని, ఆ ఇంటికి తిరిగి వచ్చాడు. వారిని ఆ వృద్ధురాలు లోపలికి తీసుకుపోయి, భోజనశాలలో పీటల మీద కూర్చోబెట్టింది. అందరి ముందూ పెద్ద పెద్ద అరటి ఆకులు వేశారు. వృద్ధురాలు అందరికీ అక్షింతలూ, ధూపమూ ఇచ్చి, పంక్తుల మధ్య నిలబడి, "నాయనలారా, అందరూ అపోశనలు పట్టి, తాపీగా భోజనాలు కానివ్వండి. కాశీవిశ్వనాథుడికి ప్రీతి చెయ్యండి," అన్నది.

వ్యాసుడూ, ఆయన శిష్యులూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. విస్తళ్ళలో ఏ పదార్థమూ లేదు, ఇంట్లో ఎక్కడా వంటపాత్రలు లేవు. కనీసం వంటవాసన అయినా లేదు.

"ఈ ముసలావిడ ఉత్తుత్త భోజనం పెట్టుతున్నది. ఇవాళ కూడా మనకు పస్తే!" అని వాళ్ళు అనుకున్నారు.

వాళ్ళు ఇలా అనుకుంటూ ఉండగా స్త్రీలు వచ్చి, ఆపోశనలు ఇచ్చారు.

"నాయనలారా, పొద్దు చాలా అయింది. ఇక భోజనాలకు ఉపక్రమించండి," అన్నది వృద్ధురాలు వారితో.

వాళ్ళు ఆపోశనలు పట్టిన మరుక్షణం అందరి విస్తళ్ళలోనూ పంచభక్ష్య పరమాన్నాలు వెలిశాయి. ఎవరికి ఏయే పదార్థాలు ఇష్టమో వారి వారి విస్తళ్ళలో అవి అన్నీ ప్రత్యక్షమయాయి.

"ఈ ముసలావిడ సాక్షాత్తూ అన్నపూర్ణా దేవే అయివుండాలి," అనుకుని అందరూ ఆత్రంగా భోజనాలు చేశారు.

భోజనాలు అయిపోగానే, వృద్ధురాలు వ్యాసుడు మొదలైన వారందరికీ విశ్రమించటానికి చోటు చూపించింది.

కొంతసేపటికి విశ్వనాథుడు పార్వతీ సమేతుడై, వ్యాసుడు తన శిష్యులతో సహా విశ్రమించి ఉన్నచోటికి వచ్చాడు. పార్వతి ముఖం ప్రశాంతంగా ఉన్నది. కాని శివుడి ముఖాన కోపం తాండవిస్తున్నది.

శివపార్వతులు రాగానే అందరూ ప్రణామాలు చేసి, నిలబడ్డారు.

శివుడు పార్వతితో సహా ఒక వేదిక మీద కూర్చుని, వ్యాసుడి కేసి కోపంగా చూస్తూ, "ఓరీ దుర్మార్గుడా! భారతం రాసిన శుంఠా! అహంకరించి, నా భార్య లాటి కాశీనగరానికి శాపం ఇవ్వబోతావా? నువు కాశీలో అడుగు పెట్టటమే ద్రోహం! వెంటనే నువూ, నీ శిష్యులూ మా పొలిమేరదాటి వెళ్ళిపొండి," అన్నాడు.

వ్యాసుడు పార్వతీ పరమేశ్వరుల కాళ్ళకు మొక్కి, తన శిష్యులతో సహా కాశీనుంచి వెళ్ళిపోవటానికి సిద్ధమయాడు.

అప్పుడాయనతో పార్వతీదేవి, "నాయనా, విచారించకు. నువు మరెక్కడికీ వెళ్ళక, దక్షారామానికి వెళ్ళి, భీమేశ్వరుణ్ణి సేవించు. నీకు సమస్త శుభాలూ చేకూరుతాయి," అన్నది.

ఆమె సలహా ప్రకారం వ్యాసుడు తన శిష్యులతో సహా భీమేశ్వరుణ్ణి అర్చించటానికి దక్షారామానికి వెళ్ళిపోయాడు.





# కొత్త అనుభవం

నీలపల్లి గ్రామానికి నిర్గుణానందుడనే స్వాములవారు, శిష్యసమేతంగా వచ్చాడు. ఆయన దర్శనానికి అనేకమంది భక్తులు వచ్చారు. నిర్గుణానందుడు భక్తి తత్వం గురించీ, వైరాగ్యంగురించీ చాలా సేపు ప్రబోధం చేశాడు. తరవాత భక్తుల్లో కొందరు తాము ఎదుర్కొంటున్న సమస్యలను ఆయనకు నివేదించారు.

నిర్గుణానందుడు అయిష్టంగా తలాడిస్తూ, ''ఇవన్నీ అతి స్వల్ప సమస్యలు. వీటి విషయంలోనే, మీరింతగా దిగాలుపడిపోతే, పెద్ద సమస్యలు ఎదురైనప్పుడు పూర్తిగా మతులు పోగొట్టుకుంటారు,'' అని సర్దిచెప్పి పంపించివేశాడు.

తమను ఎంతగానో కలవరపరుస్తున్న సమస్యలను, అతి చిన్నవంటూ స్వాములవారు మాట్లాడడం భక్తులలో చాలామందికి ఆశ్చర్యం కలిగించింది.

ఇదంతా గమనించిన గ్రామాధికారి శివగంగప్ప వాళ్ళతో, ''మీరు స్వాములవారికి నివేదించుకున్నవన్నీ, అతి స్వల్పమైన ఈతి బాధలు. ఏవైనా ఆధ్యాత్మిక సమస్యల్లాంటివైతే, వారు తప్పక పరిష్కారమార్గాలు చెప్పేవారు,'' అన్నాడు.

భక్తులకు ఆ మాటల్లో వాస్తవం వున్నట్టు కనిపించింది. కాని, వాళ్ళల్లో ఎవరికీ సామాన్య సమస్యలు తప్ప మరేంలేవు.

నిర్గుణానందుడు మరి రెండు రోజులపాటు, గ్రామస్థులకు ధర్మోపన్యాసాలు వినిపించాడు. మూడవనాటి రాత్రి శివగంగప్ప ఆయనకూ, శిష్యులకూ తన ఇంట ఆతిథ్యం ఏర్పాటు చేశాడు.

భోజనానంతరం గురు శిష్యులందరికీ, శివగరిగప్ప తగిన విధంగా తన ఇంటనే పడకలు ఏర్పాటు చేసి, నిర్గుణానరిదుడు నిద్రించే చోట దోమతెర కట్టించాడు.

జొన్నలగడ్డ రత్న

అయితే, తెల్లవారాక నిర్గుణానందుడి కళ్ళు నిద్రలేక ఎర్రబారటం, కొంచెం విసుగుదలలో వుండడం గమనించిన శివగంగప్ప, ఆయనను, "స్వామీ, తమకు రాత్రిసరిగానిద్రపట్టిందా?" అనిఅడిగాడు.

"నిద్రపట్టడమా? దోమలబాధలో కంటి మీద రెప్ప వాలలేదు," అన్నాడు నిర్గుణా నందుడు.

ఆ జవాబు విని శివగంగప్ప ఎంతో వినయంగా, "స్వామీ, తమకు తెలియని దేమున్నది! ఈ ఋతువులో కీటకాల బాధ—అందునా, యీ ప్రాంతాల దోమల బాధ అధికం. అందుకనే తమకు దోమ తెర ఏర్పాటు చేశాను," అన్నాడు.

"ఎంత దోమతెర వుంటేనేం! లోపలికి ఎలాగో ప్రవేశించిన చిన్న దోమ చాలదా, తెల్లవార్లూ కునుకుపట్టకుండా చేయ డానికి," అన్నాడు నిర్గుణానందుడు.

శివగంగప్ప అమాయకంగా ముఖం పెట్టి, "అంత చిన్న దోమ, తమలాంటి జ్ఞానుల్ని అంతగా బాధించడం ఆశ్చర్యంగా వున్నదీ. తమరు క్షమిస్తే—నిన్న తమ భక్తులు నివేదించుకున్న సమస్యలు, యింతకన్న చాలా కఠినమైనవిగా కనబడు తున్నవి," అన్నాడు.

ఆ మాటలతో నిర్గుణానందుడికి, తన పొరబాటు తెలిసివచ్చింది. మనిషిని పట్టి పీడించే ఈతిబాధలు, కేవలం ధర్మోప దేశాలతో సమసిపోవు. వాటికి పరిష్కార మార్గాలు సూచించాలి!

ఆనాటి సాయంకాలమే నిర్గుణానం దుడు, భక్తులందరినీ సమావేశపరిచి వారి, వారి సమస్యల పరిష్కారానికి తగు మార్గాలు చూపి, అందరినీ తృప్తిపరిచాడు.

రెండు రోజుల తరవాత ఆయన మరొక గ్రామానికిపోతూ, శివగంగప్పతో, "ఆ రాత్రి, ఆ చిన్న దోమ నాకొక కొత్త అను భవాన్ని కలిగించింది. లోకంలో మనిషి తానున్న స్థానానికి అనుగుణంగా, అతడి సమస్యలరూపం మారుతూంటుంది. అంతే గాని, సమస్యల్లో పెద్దా, చిన్నవంటూ లేవు!" అని, అతణ్ణి ఆశీర్వదించాడు.





# స్వయంకృతాపరాధం

నిర్వాకు డనే వైద్యుడు చాలా కాలంగా వైద్యం చేస్తున్నా, సంపాదన అంతంత మాత్రంగా వుండేది. అతడి తండ్రి భరణుడు, ''వైద్యుడికి ధనకాంక్ష వుండ కూడదు. ప్రతి రోగినీ శ్రద్ధగా పరిశీలించి, రోగానికి తగిన మందివ్వాలి. ఏ మందెలా పని చేస్తున్నదీ, ఏ రోగికి ఏ మందు బాగా పని చేస్తున్నదీ తెలుసుకోవాలి. నీ అనుభవం పెరిగినకొద్దీ, ఏ జబ్బునైనా లొంగ దీయగల దిట్టవుకావాలి. అయితే నీతీర లాగలేదు. నీ ఆశలన్నీ ఎప్పుడూ డబ్బు మీదే వుంటున్నాయి. రోగి రాగానే, అతడి జబ్బు గురించి కాక, అతడివ్వగల డబ్బు గురించి ఆలోచిస్తున్నావు. అందువల్లనే, నీవు వైద్యుడుగా రాణించడం లేదు. ఆ కారణంగా, నీ దగ్గిర డబ్బు చేరడం లేదు,'' అని కొడుకుకు తరచూ చెబుతూండేవాడు.

తండ్రి హితవాక్యాలు నిర్వాకుడికి రుచించేవికావు. అతడవి పెడచెవినిబెట్టి, తన పద్ధతిలో తాను వైద్యవృత్తి నిర్వహిస్తూండేవాడు.

ఇలా వుండగా ఒక రోజున బిచ్చగాడొకడు, నిర్వాకుడి ఇంటిముందు కళ్ళు తిరిగి పడిపోయాడు. అది చూసి నిర్వాకుడి తండ్రి పరుగునవెళ్ళి, బిచ్చగాణ్ణి ఇంటి అరుగుమీదికి చేరవేశాడు.

బిచ్చగాడికి గుండె కొట్టుకుంటున్నది; ఊపిరాడుతున్నది. వాడు ఆకలికి సొమ్మసిల్లిపడిపోయి వుంటాడని భావించి భరణుడు, వాడి ముఖాన నీళ్ళు చల్లి స్పృహ తెప్పించాడు. బిచ్చగాడు లేచి కూర్చుని, భరణుడికి చేతులు జోడించి నమస్కరించి వెళ్ళబోయాడు.

భరణుడు వాణ్ణి ఆగమని, ''ఈ పూటకు ఇక్కడే భోంచేద్దువుగాని,'' అన్నాడు.

"వసుంధర"



అందుకు బిచ్చగాడు, "వద్దు, బాబూ. ఇంతకుముందే, పక్క వీధిలోని ఒక జాలిగలతల్లి, నాకు కడుపునిండా తిండి పెట్టింది. నేను వుండే పాత సత్రానికి తిరిగిపోతూ, ఇక్కడ కళ్ళు తిరిగి పడిపోయాను," అన్నాడు.

భరణుడు ఆశ్చర్యంగా, "అయితే, నువ్వు కళ్ళు తిరిగి పడిపోవడానికి, ఆకలి కారణం కాదా?" అని అడిగాడు.

"కాదు, బాబూ. ఇదొక జబ్బు, నాకు. రోజుకు నాలుగైదుసార్లు, ఏదో ఒక సమయంలో కళ్ళు తిరిగి, ఉన్నపళంగా పడిపోతూంటాను. దీనివల్ల, బిచ్చమెత్తుకోడానికి చాలాయిబ్బందిగావున్నది. అయితే, నేను పడిపోయినప్పుడు నలుగురూ జాలిపడి నాలుగు డబ్బులు కూడా వేస్తున్నారు. అది కొంత లాభసాటిగానే వున్నది," అన్నాడు బిచ్చగాడు.

భరణుడు వెంటనే, "డబ్బు కోసం జబ్బును కోరుకోకూడదు. నీకు, నీ జబ్బు తగ్గాలనివుంటే, నాకు చెప్పు. మా అబ్బాయి చేత, నీకు తగిన వైద్యం చేయిస్తాను," అన్నాడు.

బిచ్చగాడు దీనంగా ముఖం పెట్టి, "నా రోగాన్ని కుదర్చడం, ఏ వైద్యుడి వల్లా కాదు, బాబూ! గొప్ప గొప్పవాళ్ళే, ఏమీ చేయలేక బాధపడుతున్న జబ్బిది," అన్నాడు.

"మా అబ్బాయి అందరు వైద్యుల వంటివాడు కాదు. నీకిష్టమైతే చెప్పు, ఇప్పుడే వైద్యం చేయిస్తాను," అన్నాడు భరణుడు.

బిచ్చగాడు చిన్నగా నవ్వి, "ఎందుకిష్టముండదు, బాబూ. ఊళ్ళో నలుగురి మధ్యా పడిపోతే ప్రమాదం లేదు. ఏ పొలిమేరల్లోనో పడిపోతే, ఏమైపోతాను? ఒకటి, రెండుసార్లు నేనిలాపడిపోతే, బిచ్చగాడి నన్న జాలిలేకుండా, నా డబ్బులు కాజేశారు దుర్మార్గులు. నాకీ జబ్బుని నిజంగా నయం చేయగలిగితే, మీ ఋణం ఎలాగో తీర్చుకుంటాను," అన్నాడు.



భరణుడు ఇంటి లోపలికి వెళ్ళి, కొడుక్కు బిచ్చగాడి విషయం చెప్పి, ''చాదస్తం అనుకోకు! ఒకోసారి, మను షులనబడేవాళ్ళలో, మానవత్వం పాలు ఏమున్నదో పరీక్షించేందుకు, పరమేశ్వ రుడే యిలా వస్తూంటాడు. డబ్బిచ్చుకోలేని అనాథయాచకుడని అలక్ష్యం చెయ్యక, నువ్వు శ్రద్ధగా రోగనిదానం చేసి, మంచి మందివ్వు. నీకు మేలు జరుగుతుంది. నీ జాతకం మారిపోతుంది. నా మాట కాదనకు!'' అన్నాడు.

నిర్వాకుడు విసుక్కుంటూనే వెళ్ళి, బిచ్చగాణ్ణి పరీక్షించి, లోపలికి వెళ్ళి, ఏదో మందు తయారుచేసి తెచ్చి, వాడికిస్తూ, ''నాలుగు రోజులపాటు, యీ మందును పూటకు రెండు గుళికల చొప్పున వేసుకో. నీ జబ్బు నయమవుతుంది,'' అని చెప్పాడు.

బిచ్చగాడు నిర్వాకుడికీ, భరణుడికీ దణ్ణాలుపెట్టి వెళ్ళిపోయాడు.

భరణుడు కొడుకుతో, ''నువ్వు చేసిన పని, నాకెంతో సంతోషాన్ని కలిగించింది. దేవతలు తప్పక నిన్నాశీర్వదిస్తారు! త్వరలోనే, నీ జాతకం మారిపోతుంది,'' అన్నాడు.

నిర్వాకుడు అసహనంగా, ''దేవతలు నన్నాశీర్వదించి, నా జాతకం మారిపోతే సంతోషమే. కాని, బిచ్చగాడి జబ్బు తగ్గుతుందన్న నమ్మకం, నాకు లేదు. నాకు తెలిసినంతవరకూ, వాడి జబ్బుకు మందు లేదు,'' అన్నాడు.

''అయితే మరి వాడికేంమందిచ్చావు?'' అన్నాడు భరణుడు కంగారుగా.

''మీ తృప్తికోసం ప్రమాదం కలిగించని, ఏదో మందిచ్చి పంపాను. ఆపైన వాడి అదృష్టం!'' అన్నాడు నిర్వాకుడు నిర్లక్ష్యంగా.

బిచ్చగాడి అదృష్టం ఆరోగ్యానికి సంబంధించినంతవరకూ బాగానే వున్నది! నిర్వాకుడిచ్చిన మందు, వాడిపై వెంటనే తన ప్రభావం చూపించింది.



ఒక వారం రోజుల తర్వాత బిచ్చగాడు, నిర్వ్యాకుడింటికి వచ్చి, "అయ్యా, తమరి హస్తవాసి మంచిది. ఒకప్పుడు నేను బిచ్చగాడిని కాను; కష్టపడి పొట్టపోసుకునే వాడిని. అయితే, ఈ జబ్బు రావడంతో, ఏ పనికీ కొరగాకుండాపోయాను. అప్పుడు, బిచ్చమెత్తుకోవడం తప్ప, వేరేదారి లేకుండాపోయింది. ఇక నుంచి మళ్ళీ పాతబతుకు సాగిస్తాను," అని నిర్వ్యాకుడి కాళ్లకు నమస్కారం చేశాడు.

నిర్వ్యాకుడు విచారంగా, "నా వైద్యం, నీవంటివాళ్ళకే పని చేస్తున్నది. అందు వల్లే, నా సంపాదనలో ఎదుగుబొదుగులు లేవు." అన్నాడు.

వెంటనే బిచ్చగాడు, "బాబూ, ఇంత గొప్ప వైద్యం చేసిన మీకు, నేను తగిన విధంగా డబ్బిచ్చుకోలేను. కానీ, మీకు డబ్బు సంపాయించే ఉపాయం చెప్ప గలను. ఆ విధంగా, నా ఋణమూ కొంత తీరుతుందని ఆశ!" అన్నాడు.

ఆ మాటలకు నిర్వ్యాకుడు చిరాగ్గా, "డబ్బు సంపాయించే ఉపాయాలు, బిచ్చగాళ్ళ నుంచి నేర్చుకునే దశకింకా, నేను దిగజారిపోలేదు," అన్నాడు.

ఆ సమయంలో అక్కడి కొచ్చిన భరణుడు, "ఏ పుట్టలో ఏ పాముందో! వాడు చెప్పేది సాంతం విను," అన్నాడు కొడుకును మందలిస్తూ.

అప్పుడు బిచ్చగాడు, నిర్వ్యాకుడితో, "ఇక్కడికి శరన్నగరం ఇరవై ఆమడల కన్న ఎక్కువ దూరం వుండదుగదా. ఆ నగరంలో శ్వేతగుప్తుడనే వ్యాపారి వున్నాడు. ఆయన ఏనాడో కోటికి పడగ లెత్తాడు. కానీ, ఏం లాభం! ఆయన కూడా, నాకున్నలాంటి జబ్బుతోనే చాల కాలంగా బాధపడుతున్నాడు. ఎందరో ఆయనకు వైద్యం చేసి, చేతులు దులిపేసు కున్నారు. చివరికాయన విసిగిపోయి, తనకా జబ్బు నయం చేసిన వైద్యుడికి లక్ష వరహాలిస్తానని చాటింపించాడు. ఇప్పుడు, మీరా బహుమానం సులభంగా

సంపాయించుకోవచ్చు!'' అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఇది వింటూనే నిర్వాకుడి ముఖం పాలి పోయింది. భరణుడు ఇది గమనించ లేదు. ఆయన కొడుకుతో, ''చూశావా! ధనిక పేదతారతమ్యం లేకుండా, వ్యాధిని కుదర్చాలనే పట్టుదలతో వైద్యం చేసే వాడికి, ఎప్పుడూ మేలు జరుగుతుంది. ఆ బిచ్చగాడికి సాయపడ్డావు; దేవతలు నిన్నాశీర్వదించారు. నీ జాతకం మారి పోయింది,'' అన్నాడు సంతోషంగా.

నిర్వాకుడు దీనంగా, ''నువ్వు చెప్పి నట్టు చేసి వుంటే, నిజంగానే, నా జాతకం మారిపోయేది. నేను మనస్ఫూర్తిగా బిచ్చ గాడికి వైద్యం చేయలేదు. నీ మాట కాదన లేక—కోపంతోనూ, చిరాకుతోనూ, ఏవో నాలుగు మూలికలు కలిపి నూరి, మందు తయారుచేసి వాడికిచ్చాను,'' అన్నాడు.

''అయితే మాత్రం నష్టమేముంది? ఆ మందే శ్వేతగుప్తుడికివాడు,'' అన్నాడు భరణుడు.

నిర్వాకుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, ''నా బాధ అది కాదు. బిచ్చగాడు, నాకీ విషయం ముందే చెప్పి వుండవలసింది. వాడి మందుకోసం, ఏ మూలికలు వాడానో, నాకు గుర్తులేదు. కోపంతోనూ, ఉక్రోషంతోనూ చేసిన పని అది. ఇప్పుడా మందు మళ్ళీ తయారు చేయడం, నావల్లకాదు. మనింట్లో రెండు వేల పైచిలుకుమూలికలున్నాయి. నేను మందుకోసం వాడిన, ఆ నాలుగు మూలి కలూ ఏవేమరి!'' అన్నాడు.

''స్వయంకృతాపరాధానికి విరుగుడు లేదు. నీ కర్మయింతే! అనుభవించు,'' అని భరణుడు అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

ఈ సంఘటనతో నిర్వాకుడికి బుద్ధి వచ్చింది. ఆ తర్వాత అతడు, తండ్రి చెప్పిన పద్ధతిలో వైద్యం ప్రారంభించి, మంచి వైద్యుడన్న పేరు సంపాయించు కున్నాడు. అందువల్ల, క్రమంగా అతడి సంపాదన కూడా పెరిగింది.





# పేదరాలి కృతజ్ఞత

పూర్వం బీరూట్ నగరంలో సులేమాన్ అనే పేద ముసలివా డొకడు నివసి స్తూండేవాడు. అతడు రోజూ తన భార్యా, ఇద్దరు కూతుళ్ళూ వడికే నూలును తీసుకు పోయి సంతలో అమ్మి, దానితో వచ్చిన డబ్బుతో కాలం వెళ్ళబుచ్చేవాడు. రాబడి ఏ పూటకు ఆ పూట బొటాబొటిగా సరి పోవడం వల్ల, అతడు దమ్మిడీ కూడ బెట్టలేకపోయాడు. ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళీడు వచ్చినా, పెళ్ళి చేయలేక దిగులు పడసాగాడు.

ఒకనాడు సులేమాన్ నీరసంగా ఉండ డంతో సంతకు వెళ్ళలేకపోయాడు. ఆ రోజు అతని పెద్ద కూతురు నూలును అమ్మకురావడానికి సంతకు వెళ్ళింది. సంతలో ఆమె అనుకున్న ధరకు నూలును అమ్మి, ఆ డబ్బుతో మూడు రొట్టెలు కొనుక్కొని ఇంటిదారి పట్టింది.

ఆమె ఒక సందుగుండా నడిచి వెళు తున్నప్పుడు, దాపులనున్న గుడిసెలో నుంచి, అతిదీనంగా ఒక స్త్రీ మూలుగు వినిపించింది. ఆమె ఆగి, మూలుగు వస్తూన్న గుడిసెలోకి తొంగి చూసింది. ఆ గుడిసె లోపల నేల మీద, ఇద్దరు పసి బిడ్డలతో ఒక పేదరాలు పడుకుని, లేవ డానికి కూడా శక్తి లేక మూలుగుతున్నది!

సులేమాన్ కూతురు లోపలికి పోయి, "ఏమిటమ్మా, నీ బాధ? ఎందు కలా మూలుగుతున్నావు?" అని అడిగింది.

"ఆకలి తల్లీ! మూడు రోజులుగా తిండి లేక మాడిపోతున్నాము," అన్నదా పేదరాలు.

"నా వద్ద మూడు రొట్టెలున్నవి. అవి మీకు ఈ పూటకు సరిపోతాయి. మరి రేపు ఏం చేస్తారు?" అని అడిగింది సులేమాన్ కూతురు.

"ఈ పూట ఇంత ఆహారం దొరికితే చాలు తల్లీ, అది తిని ప్రాణాలు నిలుపుకుని, పక్కపట్టణానికి వెళ్ళిపోతాము. అక్కడ మాకు ధనవంతులయిన బంధువులున్నారు," అన్నదామె.



సులేమాన్ కూతురు తన దగ్గరున్న రొట్టెలు తీసి ఆమె కిచ్చింది. తల్లీ బిడ్డలు, వాట్టిని తిని ఆకలి తీర్చుకున్నారు.

తరవాత ఆ పేదరాలు, "అమ్మాయీ, నీ దయాగుణం సాటిలేనిది. నీకు ప్రత్యుపకారంగా ఇవ్వడానికి నా దగ్గర ఈ కూజా తప్ప మరేదీలేదు. ఇది ఖాళీ కూజా కాదు. తీసుకో తల్లీ," అంటూ ఒక పాత కూజాను అందించింది.

సులేమాన్ కూతురు కూజాను పరిశీలించి చూసింది. అందులో ఏమీ లేదు.

"ఈ కూజా ఖాళీగా ఉన్నా, ఇందులో ఏమైనా ఉన్నా, దీని అవసరం మాకు ఇప్పుడు లేదు. మీరే ఉంచుకోండి," అన్నదామె.

"ఇది ఖాళీ కూజా కాదన్నాను కదా! నా మాట విని దీనిని నువు తీసుకుపో తల్లీ," అని బతిమాలింది పేదరాలు.

ఆమె మాటను కాదనలేక, సులేమాన్ కూతురు కూజాను తీసుకుని ఇంటికి పోయి, దారిలో జరిగినదంతా తల్లిదండ్రులకు వివరంగా చెప్పింది.

ఆమె పేదరాలిపట్ల చూపిన కరుణ ఫలితంగా వాళ్ళందరూ ఆ పూట పస్తు ఉండవలసి వచ్చింది. అయినా అలా జరిగినందుకు ఎవరూ బాధపడలేదు!

అంతా విన్న సులేమాన్ పెద్దకూతురితో, "మంచి పనే చేశావమ్మా. ఇప్పుడు ఈ కూజాను అమ్మితే ఒక రొట్టెయినా వస్తుంది కదా?" అని, చిన్న కూతురు కేసి తిరిగి, "నువు ఈ కూజాను అమ్మిరా," అన్నాడు.

చిన్న కూతురు ఆ కూజాను తీసుకుని సంతకు వెళ్ళి, ఒకచోట కూర్చున్నది. ఆ దారిగుండా ఎందరెందరో వెళ్ళారు గాని, ఒక్కరు కూడా ఆ కూజా ధర ఎంత అని అడిగిన పాపాన పోలేదు.

సాయంకాలం సంత ముగుస్తున్న సమయంలో, ఒక బెస్తవాడు ఆమె దగ్గరికి వచ్చి "నా బుట్టలో ఒక చేప మాత్రం మిగిలి ఉన్నది. చౌకగా అమ్మితాను కొనుక్కో." అన్నాడు.

"ఆ చేప కొనడానికి నా దగ్గర డబ్బు లేదు. ఈ కూజా తీసుకుని దాన్ని ఇచ్చావంటే తీసుకుంటాను," అన్నదామె.

వాడు కూజా కేసి కొంతసేపు చూసి, వచ్చినంతవరకు లాభం, అనుకుని చేపను ఆమె కిచ్చి, కూజా తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆమె చేపను ఇంటికి తెచ్చి తల్లి చేతి కిచ్చింది. ఆమె చేపను రెండు ముక్కలుగా కోసినప్పుడు, దాని కడుపులో నుంచి ఒక ముత్యం బయటపడింది. దానిని చూడగానే అందరూ ఆశ్చర్యానందాలు చెందారు.

సులేమాన్ మర్నాడు పొద్దునే లేచి, తన చిన్ననాటి స్నేహితుడయిన ఒక నగల వ్యాపారి దగ్గరికి పోయి ముత్యాన్ని చూపించాడు. ఆ వ్యాపారి ముత్యాన్ని పరిశీలించి చూసి, "ఇలాంటి మేలిరకం ముత్యాన్ని నేనింతవరకూ చూడలేదు. దీనికి తగ్గ ధర నేనివ్వలేను. నాకన్నా పెద్ద వజ్రాల వ్యాపారి అయిన మిత్రు డొకడున్నాడు. అతనివద్దకు వెళదాం." అని అతణ్ణి వెంటబెట్టుకుని అక్కడికి వెళ్ళాడు.

ఆ వజ్రాల వ్యాపారి, ముత్యాన్ని తీసుకుని చాలా పెద్ద మొత్తం చెల్లించాడు.

ఆ ధనంతో సులేమాన్ కష్టాలు తీరిపోయాయి. కుమార్తె లిద్దరికీ మంచి సంబంధాలు చూసి, ఘనంగా పెళ్ళిళ్ళు చేశాడు.

ఒకనాడు సులేమాన్ కూతుళ్ళతో, అల్లుళ్ళతో కూర్చుని విందుభోజనం చేస్తూ, "ఆ పేదరాలు అన్న మాటలోని రహస్యం ఇప్పుడే నాకు బోధపడుతున్నది. ఆమె ఇచ్చిన కూజా నిజంగానే ఖాళీ కాదు. దాని నిండుగా మంచి మనసు, కృతజ్ఞత ఉన్నవి. వాటి మూలంగానే కష్టాలు తొలగి, మనకి అదృష్టం పట్టింది," అన్నాడు ఎంతో కృతజ్ఞతతో.





# వీరాధివీరుడు

పూర్వం కళింగదేశానికీ, వంగదేశానికీ మధ్య ఉండే సరిహద్దులో ఒక కోట ఉండేది. అది చూడటానికి కోటలాగే బురుజులూ, ప్రహరీగోడలూ కలిగి ఉండేది. కాని నిజంగా సేనలు వచ్చి ముట్టడిస్తే ఎందుకూ పనికిరాదు.

ఈ కోటలో జితవర్మ అని ఒక వెర్రి బాగులవాడు నివసిస్తూ ఉండేవాడు. అతని పూర్వీకులు ఒకప్పుడు రాజ్యాలు ఏలారు. అందుచేత తాను కూడా ఒక మహావీరుడనని జితవర్మ అనుకుంటూ ఉండేవాడు. "మనని చూస్తే ఎటువంటి వాళ్ళకూ గుండె దడ! అందుచేతనే మన కోటపైకి ఎవరూ దండెత్తి రారు! అర్జునుడూ, కర్ణుడూ ఏకమై వచ్చినా నా ధాటికి తట్టుకోలేరు!" అని జితవర్మ ప్రగల్భాలు పలుకుతూ ఉండేవాడు. చుట్టుపక్కలవాళ్ళు అతని ప్రగల్భాలు నమ్మినట్టు పైకి నటిస్తూ, చాటుగా అతన్ని చూసి నవ్వుకుంటూ ఉండేవాళ్ళు.

తన ప్రతాపం రుజువు చెయ్యటానికి, జితవర్మ అప్పుడప్పుడూ కొందరు మనుషులను వెంటబెట్టుకుని ఏ జమీందారు ఆస్తి మీదనో పడి దోచుకురావటానికి ప్రయత్నిస్తూండేవాడు. జితవర్మ ఏ కోడినో, గొర్రెనో ఎత్తుకుపోతే జమీందార్లు లక్ష్య పెట్టేవారు కారు. అంతకంటె పెద్ద దొంగ తనానికి పూనుకున్నప్పుడు, వారు తమ నౌకర్లను పంపి, జితవర్మనూ, అతని అనుచరులనూ కొట్టించేవారు. అలా దెబ్బలు తిని వచ్చినప్పుడు జితవర్మ, "పిరికి పందలు! ధైర్యం ఉంటే వాళ్ళే వచ్చి నాతో ముఖాముఖీ యుద్ధం చెయ్యాలి గాని, తమ వెట్టివాళ్ళను నా మీదికి పంపు తారా? అటువంటి నీచులతో నేను యుద్ధం చేస్తానా?" అనేవాడు.



బందిపోటుకు పోయి జితవర్మ దెబ్బలు తిని వచ్చినప్పుడు, అతని భార్య అతని వీపున ఉండే గాయాలకు మందు రాచేది. తన భర్త వెర్రిబాగులవాడని ఆమెకు తెలుసు; కాని చేసేదేమీ లేదుగనక తన భర్తను ఉబ్బవేయటానికి, "నీచులు'! చూడండి, అన్ని గాయాలూ వీపునే ఉన్నాయి! ధీరులైతే ఎదురుగా వచ్చి కొట్టాలి. అంతేగాని వెనకపోట్లు పొడుస్తారా?" అనేది.

"నా ఎదటికి రావటానికి వాళ్ళకు గుండెలున్నాయా?" అనేవాడు జితవర్మ.

ఒకనాటి ఉదయం ఒక వింత జరిగింది. కోట మీది బురుజులో కాపలా కాసే నౌకరు దిగి వచ్చి జితవర్మతో, "దొరా, పెద్ద సేన! మన కోట మీదికే వస్తున్నది!" అని రొప్పుతూ చెప్పాడు. జితవర్మ గట్టిగా హుంకరించి బురుజు మీదికి వెళ్ళాడు. కళింగదేశం నుంచి ఒక పెద్ద సేన వస్తూ ఉండటం అతనికి కనిపించింది. ఆ సేనలో రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కూడా ఉన్నాయి. కనీసం ఇరవైవేలమంది సైనికులున్నారు.

జితవర్మ తన నౌకర్ల నందరినీ పిలిచి, "ఒరే, ఇవాళ మనకు సుదినం. ఈ కళింగులు మన కోటను పట్టుకోటానికి వస్తున్నారు. నా బాణాలూ, ఈటెలూ, విల్లులూ బురుజులో పెట్టండి. నేను ఒంటరిగా ఈ సేనను నాశనం చేసి విజయలక్ష్మిని వరిస్తాను. కళింగరాజును నా సామంతుణ్ణి చేసేసుకుంటాను. ఏమి వాడి పొగరు! హా," అని చిందులు తొక్కాడు.

అంత పెద్ద సేన ఈ మారుమూల కోటను ముట్టడించటానికి వస్తున్నదని నౌకర్లు నమ్మలేదు. ఆ సైనికులంతా చేరి తలా ఒక రాయీ పీకినా కోట ఉండదు.

కళింగసేన జితవర్మతో యుద్ధం చెయ్యటానికే వచ్చినట్టు త్వరలోనే స్పష్టమయింది. ఆ సేనలు కోటకు అల్లంత దూరంలో వచ్చి నిలబడ్డాయి. సేనాధిపతి గుర్రం మీద కోటను సమీ

పెంచి, తల ఎత్తి బురుజులో ఉన్న జిత వర్మతో, ''ఈ కోటలో ఉండే పరాక్రమ శాలి ఎవరు ?'' అని అడిగాడు.

''వేరే అడగాలా ? నేనే!'' అన్నాడు జితవర్మ ధీమాగా.

''అయితే వెంటనే మీ కోటను మా వశం చెయ్యండి! లేదా యుద్ధంలో మిమ్మల్ని, మీ కోటనూ నేలమట్టం చేసేస్తాం! కళింగదేశపు రాజు ఆజ్ఞపై మేము వంగదేశాన్ని యావత్తూ దిగ్విజయం చేయవచ్చాం!'' అన్నాడు కళింగ సేనాధిపతి.



''ఔరా, నీచుడా! ఏమి మీ రాజు కావరము! చూడు, నిన్నూ నీ సేననూ ఇప్పుడే యమలోకానికి పంపుతాను! జిత వర్మ పరాక్రమం ఏమిటనుకున్నావు ?'' అంటూ జితవర్మ శత్రుసేనాధిపతి పైన ఒక బాణం ఎక్కుపెట్టి వదిలాడు. ఆ బాణం సేనాధిపతికి చాలా దూరంలో పడిపోయింది.

సేనాధిపతి సంజ్ఞ చేశాడు. కొంత సేన ముందుకు వచ్చి కోటపై బాణాలు వెయ్యా నారంభించింది. జితవర్మ తన భటులను హెచ్చరించి, సైనికులపైన బాణాలు కురిపించసాగాడు. అతని బాణాలు గాని, కళింగ సైనికుల బాణాలు గాని ఎవరికీ తగలలేదు, ఏమీ నష్టం కలిగించలేదు.

ఈ విధంగా ఒక అరగంట సేపు యుద్ధం జరిగాక కళింగసేనలు వెనక్కు తగ్గాయి. ''పిరికి పందలు! వెనక్కు వెళ్ళారు! నా ప్రతాపం వాళ్ళెరగరు,'' అని జితవర్మ తన భటులతో వీరావేశంతో అన్నాడు.

అయితే కళింగ సేనలు పూర్తిగా వెళ్లి పోలేదు. కోటకు అల్లంత దూరంలో వాళ్ళు శిబిరం ఏర్పాటు చేసుకున్నారు. రోజూ ఉదయం పూట ఒక అరగంటా, సాయంకాలం పూట ఒక అరగంటా కొద్ది మంది సైనికులు ముందుకు వచ్చి కోట గోడలకేసి బాణాలు కొట్టి మళ్ళీ వెనక్కు వెళ్ళిపోయేవారు.

ఇలా పది రోజులు గడిచాక కళింగ సేనాధిపతి తన గుర్రం మీద కోటను సమీపించి, ''జితవర్మా, మేము యుద్ధంలో ఓడిపోయాము. మనం సంధి చేసుకునే టందుకుగాను, కోట ద్వారాలు తెరిపించండి!'' అని కేకపెట్టాడు.

''ఈ పని మొదటనే చేస్తే, మీకూ మాకూ కూడా శ్రమ తప్పేదిగా!'' అంటూ జితవర్మ కోట తలుపులు తెరిపించి శత్రు సేనాధిపతిని లోపలికి రానిచ్చాడు.

''ఇక నుంచీ మీ కళింగరాజు నాకు సామంతుడుగా ఉండి కప్పం చెల్లిస్తాడా?'' అని జితవర్మ సేనాధిపతిని అడిగాడు.

''అప్పుడే కాదు. ప్రస్తుతానికి మా సేనలో సగానికి పైగా యుద్ధంలో చనిపోయినట్టూ, మిగతా సగంలో ఒక వంతు మీకు ఖైదీలుగా చిక్కినట్టూ పత్రం రాసి ఇవ్వండి,'' అన్నాడు కళింగ సేనాధిపతి.

ఆ పత్రం తీసుకుని సేనాధిపతి తన సేనతో సహా వంగరాజు వద్దకు వెళ్ళాడు. అసలు సంగతేమంటే కళింగరాజ్యాన్ని కాజెయ్యటానికిగాను ఒక కుట్ర జరిగింది. వంగరాజ్యాన్ని జయించి వస్తానని చెప్పి కళింగ సేనాధిపతి సేనతో సహా వచ్చి సరిహద్దు మీద తనకు కనిపించిన మొదటి కోట వద్ద యుద్ధం చేసినట్టు నాటకం ఆడాడు. తన సేన దాదాపు నాశనమై పోయినట్టు జితవర్మ దగ్గిర పత్రం పుచ్చుకుని ఆ సైన్యాన్ని వంగరాజు పరం చేసి, తాను కొద్దిమంది సైనికులతో తన దేశానికి తిరిగి వెళ్ళాడు. తరవాత కొద్ది కాలానికి వంగ సైన్యాలు కళింగదేశాన్ని ముట్టడించి జయించాయి.

ఇదంతా జితవర్మకుగాని, సరిహద్దులో ఉండేవారికి గాని తెలియదు. జితవర్మ యోధానయోధుడనీ, తన పైకి దండెత్తి వచ్చిన కళింగ సేనలను ఒంటరిగా నాశనం చేశాడనీ చెప్పుకున్నారు. జితవర్మ కూడా తనవల్లనే కళింగసేన సగం పైగా నాశనమయినట్టు నమ్మాడు. ఈ యుద్ధాన్ని చూసినవారు లేకపోవటంచేత, వాస్తవంగా జరిగినదేమిటో ఎవరికీ తెలియదు.



# ఎడారి జంతువులు

కొన్ని రకాల చెట్టుచేమలు పెరగడానికి కూడా అనుకూల వాతావరణం లేని ఎడారి ప్రాంతాలలో సైతం, రకరకాల స్తన జంతువులూ, ప్రాకుడు జంతువులూ నివసించడం ప్రకృతి వింతలలో ఒకటి. ఎడారి భూములలో ప్రాణులు అమితమైన వేడినీ, నీటి కొరతనూ భరించాలి. ఎండవేడి నుంచీ, శత్రు జంతువుల బారినుంచీ తప్పించుకోడానికి మరుగు ప్రదేశాలు ఉండవు. అయినా ఎటువంటి క్లిష్టపరిస్థితుల నైనా తట్టుకుని నిలబడగలశక్తి, కొన్ని జంతువులకు ప్రకృతిసిద్ధంగానే అలవడి ఉన్నది.

గరుకుగా ఉన్న పొడవైన ముళ్ళతోక గల బల్లి వంటి జంతువులు, ఈశాన్య ఆఫ్రికాలో మాత్రం కనిపిస్తాయి. ఇవి బలమైన గోళ్ళతో, రెండు మీటర్ల లోతు బొరియలు చేసుకుంటాయి. చలికాలం రాత్రులలో, విపరీతమైన చలి నుంచి తప్పించుకోడానికి ఈ జంతువులు బొరియలలో చుట్టుకుని పడుకుంటాయి. వీటి బలమైన తోక, ఆపదల నుంచి రక్షించుకోడానికి ఆయుధంగా ఉపయోగపడుతుంది. పాములు వీటిని మింగడానికి వచ్చేప్పుడు, బొరియలలో దూరబడి, తోకను బొరియకు అడ్డంగా ఉంచి, పాము లోపలకు రాకుండా అటకాయిస్తాయి.

ఎడారి ప్రాంతాలలో నివసించే మరొక ముఖ్యమైన రకం జంతువులు కంగారూఎలుకలు. రాత్రులలో సంచరించే ఈ ఎలుకలు పగలల్లా బొరియలలో ఉంటాయి. కొన్ని రకాల మొక్కలను, ఎండు గింజలను, దుంపలను తినే ఈ ఎలుకలు నీళ్ళు తాగకుండానే జీవించగలవు। ఇతర ఎడారి జంతువులకు లాగానే ఈ ఎలుకలకు కూడా వినికిడిశక్తి చాలా ఎక్కువ. తమను పట్టుకోడానికి వచ్చే గుడ్లగూబలు, పాములు మొదలైనవాటి అలికిడిని దూరం నుంచే పసికట్టి, సురక్షిత ప్రాంతాలకు పోయి దాక్కుంటాయి.



సహారా ఎడారిలో కనిపించే జర్బోవా జాతి ఎలుకలు కూడా ఇంచుమించు కంగారూఎలుకల్లాగానే ఉంటాయి. అయితే ఈ ఎడారిఎలుకలు వాటికన్నా పొడవైన తోకలు కలిగి ఉంటాయి. వేగంగా గంతులు వేస్తూ, కంగారూ ఎలుకలకన్నా వేగంగా పరిగెత్తగలవు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 మే నెల సంచికలో ప్రకటించబడును.



M Natarajan



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఊహకు అందని చేష్టలు రెండవ ఫోటో: ఉరకలు వేసే నవ్వులు

పంపినవారు: కె. కోదండ, బజారువీధి, తిరుపతి–517 501.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. 70–80 సార్లు 2. 1967 వ సంవత్సరంలో 3. ఇంచుమించు 1400 క్యూబిక్ సెంటిమీటర్లు 4. మూడిజరపై రోజులు 5. పెన్సిలిన్ కనుగొన్నారు

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## Statement about ownership of CHANDAMAMA (Telugu)
## Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| *1. Place of Publication* | ... 'CHANDAMAMA BUILDINGS'<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | ... MONTHLY<br>... 1st of each calendar month |
| *3 Printer's Name* | ... B.V. REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | ... B. VISWANATHA REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... Chandamama Publications<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | ... B. NAGI REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... Chandamama Buildings'<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | ... CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS<br><br>1. B. VENKATRAMA REDDY<br>2. B.V. SANJAY REDDY<br>3. B.V. NARESH REDDY<br>4. B. PADMAVATHI<br>5. B. VASUNDHARA |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1986*

"ముఖంపై మొట్టమొదటి మొటిమ వచ్చిందని కనుక్కున్న రోజు.
అదే నేను క్లియరసిల్‌ని కనుక్కున్న రోజు"



నాకింకా బాగా గుర్తుంది ఆ రోజు. నేను ఉత్సాహంతో గంతులువేస్తున్న రోజు....అక్కయ్య పెళ్ళి యింకా సరిగ్గా వారం రోజులుందేమో. కొత్త బట్టలు ముచ్చటగా వేసుకుంటూ అద్దం ముందు నిలబడ్డా—చటుక్కున గాబరాపడ్డా....నా బుగ్గ మీద ఏదో వచ్చిందని చూసుకుని....మొటిమ. నా ముఖంపై వచ్చిన మొట్టమొదటి మొటిమ. నేననుకున్నా చటుక్కున....నా కేమిటి, యిదేమిటి, యిప్పుడే రావాలేమిటి అని!

అప్పుడే వచ్చింది అక్కయ్య అక్కడికి. చూసింది నా వాలకం—"పిచ్చి పిల్లా, యీ మాత్రం తెలియదా. యీ వయసులో అందరికీ వస్తాయి గదా మొటిమలు. నాకూ వచ్చాయి. వాడేను నేనప్పుడు క్లియరసిల్. వాడాలి నువ్వు మరి, ఏం?" వాడేను నేనూ మరందుకే. ఏమైందో తెలుసా? పనిచేసిందది!....ఇక ఆ ఉషారులో పెళ్ళి పందిట్లో ఎంత చలాకీగా తిరిగానో ఏం చెప్పమంటారు.

**క్లియరసిల్,
మొటిమల్ని
పోగొడుతుంది,
దాంతో బాటే వాటిని
పాకకుండా చేస్తుంది.**






OBM/5687/TL

# క్లియరసిల్

మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స-ఎక్కువ ప్రభావంతో పనిచేసేది.

# పార్లే - G

## పార్లే గ్లూకో బిస్కట్లకు
## ఇప్పుడు ప్రేమతో నిండిన పేరు 'పార్లే - G'

### 'పార్లే-G' ఎందుకని?






మీకు అత్యంత ప్రియమైన బిస్కట్లకు చక్కటి తియ్యటి చిట్టిపేరు ఉండవద్దూ! అందుకే 'పార్లే-G' అన్న పేరు. అదును కదా మరి. 'పార్లే-G' అని పిలవడంలో మరెంతో సాన్నిహిత్యం వ్యక్తమవుతుంది.

ఈ బిస్కట్లలో జీవనదిలా ఆ పాలు, గోధుమలు, చక్కెర, జీవనదిలా ఆ శక్తినిచ్చే గ్లూకో, జీవనదిలా ఆ గొప్పరుచి పొంగి పొర్లుతుంటే 'పార్లే-G' అన్న పేరు వీటికి చక్కగా నప్పుతుంది కదూ!

PARLE
Gluco
మరింత రుచిగల శక్తిదాయక ఆహారం

భారతదేశంలో అత్యధికంగా అమ్ముడవుతున్న బిస్కట్.

everest/85/PP/490/TL